రైతులారా!

Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పత్రిక

సంపాదకుడు: మద్దూరి అన్నపూర్ణయ్య

సంపాదకవర్గం: కంభంపాటి సత్యనారాయణ. పుచ్చలపల్లి సుందరయ్య. తుమ్మల వెంకట రామయ్య. మద్దుకూరి చంద్రశేఖరరావు.

సంపుటం 1 | బుధవారము 31-8-38 బెజవాడ | సంచిక 36

ఆంక్ష తీసివేయండి!




స్పైన్ రిపబ్లిక్కు ఆయుధ సామాగ్రిని పంపి సహాయం చేయండి!



# నవశక్తి

చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్ధసంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

* * *

అడ్వర్టైజుమెంటు రేటులు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు)

| | |
|---|---|
| కాలంలో 1" మొదలు 20" వరకు ప్రతి అంగుళానికి రూ. | 0—6—0 |
| 20" — 100" వరకు .. | 0—4—0 |
| 100" పైగా .. | 0—3—0 |
| పాతిక పేజీకి | 3—0—0 |
| సగము పేజీకి | 6—0—0 |
| ఒక పేజీ మొదలు 15 పేజీల వరకు పేజీ ఒకటికి | 10—0—0 |
| 15 పేజీలకు పైగా పేజీ 1కి | 7—8—0 |

ఈ వరకు అంగీకరించిన కంట్రాక్టులకు ఈ రేట్లు వర్తించవు.

ఈ రేట్లలో కన్సెషన్సు, కమిషన్సు ఏమీ ఉండవు.

* * *

చందాదారులను చేర్పించాలి!

గత మాసపు 'కోటా' అందరూ పూర్తిచేయలేదు.

ఆగస్టులో ఈ క్రింది విధంగా జేర్పించాలని క్రొత్తగా మరో లిస్టు ఇచ్చినాం. ఈ "కోటా"లు పూర్తి అయేటట్లు పార్టీ సభ్యులు, సోషలిస్టు అభిమానులు, ప్రజాసామాన్యము పని చేస్తారని ఆశిస్తున్నాం.

ముఖ్యంగా పార్టీ సభ్యులు గత మాసం కంటె తీవ్రంగా పనిచేసి 'కోటా' పూర్తి చేస్తారని నమ్ముతున్నాం.

| | ఆగస్టు నెల కోటా | 4 వారాలలో చేర్పించినది |
|---|---|---|
| విశాఖపట్టణము | 15 | 5 |
| తూ. గోదావరి | 100 | 23 |
| ప. గోదావరి | 200 | 26 |
| కృష్ణా జిల్లా | 100 | 59 |
| గుంటూరు | 100 | 10 |
| నెల్లూరు | 60 | 20 |
| రాయలసీమ | 15 | 1 |
| ఇతరస్థలాలు | 10 | 8 |
| | 600 | 152 |

# ప్రెస్ కార్మికులపై దండయాత్ర

ఏలూరు యజమానుల ధోరణి—గిరిగారి సుభాషితాలు—మద్రాసు బస్సుల సమ్మె—బొంబాయి, కలకత్తాల సమ్మెలు.

## ఏలూరు.

ఏలూరులో ప్రింటర్సు అసోసియేషన్ అనే పేరుతో ప్రెస్సు యజమానుల సంఘం ఒకటి ఏర్పడినది. దానియొక్క ప్రధానోద్దేశ్యము అచ్చు పరిశ్రమను అభివృద్ధి చేయుట. ఆ సంఘము ది 24-8-38 వ తేదీ ఉదయం 11 గంటలకు సమావేశమై కొన్ని తీర్మానములను చేసినది. అందులో కొన్ని.

2. ఒక ఆఫీసులో తీసివేయబడిన పనివానిని అట్లు తీసివేసిన ఆఫీసు యజమాని యొక్క అనుజ్ఞ లేనిదే ఇంకొక ఆఫీసులో పెట్టుకొన కూడదు.

3. ఒక ఆఫీసులో ఏ కారణము చేతనైనా పని ఇబ్బంది కలిగినపుడు మిగతా ఏ ఆఫీసు వారైనను ఆ పనిని నెరవేర్చి పరస్పర సహాయము చేసుకొన వలయును.

4. పనివాండ్రు వ్రాత మూలకమగు శలవు పొందక చేయు నాగాలకు, రోజుకు రెండు రోజులు చొప్పున జీతము మినహాయించ వలయును.

5. ప్రెస్సు యజమానికి గాని ఫోర్మన్‌కు గాని ఏ మాత్రము అవిధేయతగా ప్రవర్తించినను అట్టి పనివారిని పనినుండి వెంటనే తొలగించ వలయును.

7. ఏ ప్రెస్సులోనైనా పనివారలకు యజమానికి కలిగిన తగాదాలలో ఆ ప్రెస్ యజమాని యొక్క తీర్పే ఆఖరు పరిష్కారముగా ఎంచుకోబడవలెను.

9. పనివాండ్రను చేర్చుకొనుట, తీసివేయుట సందర్భములలో ఆయా ప్రెస్సులలో అమలునందున్న నిబంధనల ప్రకారమే చేర్చుకొన వలయును.

ఈ తీర్మానాలన్నీ కార్మికులను నిరంతర దుర్భర దారిద్ర్యంలో ముంచివేయుటకే ఏర్పాటు చేయబడినవి. దీనిని గమనించి కార్మికులు తమ సంఘీభావాన్ని వృద్ధి చేసుకోవాలి-కార్మికులను అణచివేయుటకు యజమానులు వేసే యీ ఎత్తును తమ ఐక్యత ద్వారా కార్మికులు నిరర్థకం చేయాలి.

ఇందులో 6 వ తీర్మానం మరీ దారుణంగా వుంది. "పనివారలకు ప్రతి నెల జీతములున్న మరుసటి నెల దాటకుండా యివ్వవలెను." అని తీర్మానం: ఏమి ఉదార హృదయం? అప్పటికేనా యివ్వాలని తీర్మానించారు. అసలు ఇవ్వ కూడదన్నారు కాదు!

ప్రెస్సులు ఫ్యాక్టరీ అక్టు క్రిందకు రాకపోవుటచే, ఆ అక్టు తమకు వర్తించదనే ధీమా చేత గాబోలు యీ విధంగా మరుసటి నెల వరకూ జీతాలివ్వడం వాయిదా పెట్టుకున్నారు. ఇది మహా దారుణం.

ఇంక పదవ తీర్మానం. "ప్రెస్సులకు ప్రెస్సు యజమానులకు హానికర మగునట్లు ఏవైనా సమ్మెలు తదితరములు జరిగిన యెడల ప్రెస్సు యజమానులందరు ఏకీభవించి కష్ట నష్టముల కోర్చి పరస్పర సహాయంతో ప్రెస్సులు నిర్వహించవలెను". దీనికి ప్రతీకారంగా ఏ ప్రెస్సులో ఏ కార్మికునికి యజమాని అన్యాయం చేసినా సరే, దానిని ఎదుర్కొనుటకు అన్ని ప్రెస్సులలో నున్న కార్మికులూ ఏకమై అతనిని ఆచిక్కునుండి తప్పించుటకై పనిచేయాలి. కార్మికులను ఉద్ధరించుటకు అన్ని ప్రెస్సులలో నున్న కార్మికులూ ఏకమై నిలబడితే, ఏ విధముగ్గాను యజమానులు తమ తీర్మానాన్ని నెగ్గించుకొని అమలు జరుపలేరు.

యజమానుల ఇట్టి దుర్మార్గాన్ని ఎదుర్కొనుటకు కార్మికులకు ఒక్కటే ఆయుధం. "ఐక్య పోరాటం." దీనిని రక్షించుకొనుటకు కార్మికులు కృషిచేయాలి.

### తోళ్ళ పనివారు.

ఏలూరు తోళ్ళ పనివారు 6 నెలల క్రితం సమ్మెచేసి యజమానుల నుండి కొన్ని హక్కులను సంపాదించుకొనిరి. కూలి రేటు హెచ్చించుకొన్నారు. పిడత కట్నం వదిలించుకొన్నారు. వెట్టి చాకిరీ పోయింది. సమ్మె తరువాత సంఘం చురుకుగా పని చేయకపోవుటచే యజమానులు తిరిగి కూలీలను హింసించుటకు ప్రారంభించారు. కూలీ సంఘ అధ్యక్షుడినే పనినుండి తొలగించివేశారు. పిడత కట్నం వగైరాలను బాకీలపేరుతో వసూలు చేస్తున్నారు. కూలీలను తిట్టుట కొట్టుటలు కూడ ప్రారంభించారు. సంఘం చురుకుగా పని చేయకపోతే కార్మికులు శ్రమపడి సంపాదించిన హక్కులన్నీ యజమానులు హరించి వేస్తారు. అందుచే కార్మికుల నైతిక శక్తి నిలుపుటకు కార్మిక నాయకులు పనిచేయాలి.

## కార్మిక సమస్యలు

అధ్యయన తరగతులు జరపాలి. కార్మికులలో చైతన్యం వృద్ధి చేయాలి. యూనియన్ బలాన్ని వృద్ధిచేయాలి. అవుసరం కలిగినపుడల్లా ఒక షాపు కూలీలింకొక షాపు కూలీలకు తోడగునట్లు చేయాలి.

## సామర్లకోట.

### గిరిగారి సుభాషితాలు

సామర్లకోట పంచదార మిల్లు కార్మికులిదివరలో సమ్మెచేసి, ప్రభుత్వపు కార్యదర్శి బి. యస్. మూర్తిగారి వాగ్దానాన్ని సలహాను అనుసరించి సమ్మెను ఆపుచేశారు.

21 వ తేదీని గిరిగారు సామర్లకోట వెళ్లారు. వేరే సమావేశమైన కార్మికుల నందరినీ కంపెనీ అవరణలోకి రావలసినదని శెలవిచ్చారు. కార్మికుల మానసిక ప్రవృత్తి గిరిగారికి తెలియనిదిగాదు, అందులోనూ ముఖ్యంగా యజమానులకు కార్మికులకు మధ్య తగాదా ఉన్నప్పుడు ఒకరివద్దకు ఒకరు వెళ్లేటయ్యే వారి వారి హక్కుకు భంగమని తలచే స్థితిలో ఉంటారు. అటువంటి స్థితిలో యజమానులు తమ వద్దకు వచ్చుట తమకు విజయమని కార్మికులు తలుస్తారు. యజమానుల వద్దకు తాము పోవుట యజమానులకే జయమని యజమానులూ తలుస్తారు. కార్మికులూ తలుస్తారు. ఇదేగాదు. రేపు యీ సావకాశాన్ని తీసుకొని, "మీరు వేరే మీటింగు ఏర్పాటు చేసుకొన్నా ఆఖరికి మాదగ్గరికి మిమ్మల్ని రప్పించారు మంత్రిగా"రని కార్మికులను, కార్మిక సంఘాధికార్లను యజమానులు చులకనగా చూస్తారు. ఈ అవకాశాన్ని గిరిగారు కల్పించి యుండకూడదు. ఇది వర్గ సామరస్యమని గిరిగారు తలంచినను అట్లైనట్టికినీ కాదు. కార్మికులను లోకువ చేయుటయే.

అయినా కార్మికులు కాంగ్రెసు మంత్రి గిరిగారి సలహాలు అమలు జరిపి కాంగ్రెసుపై వారికున్న గౌరవాన్ని అభిమానాన్ని రెండవ సారి స్పష్టంగా వెల్లడించారు. వారి హక్కులను నెరవేర్చు కాంగ్రెసు మంత్రిగారి బాధ్యతయే మిగిలింది.

### ఇంకా పోరబాట్లే?

"కంపెనీలో మీరెంత శ్రమపడి పనిచేస్తే యజమానుల కంత లాభాలువస్తాయి. వారికెంత లాభంవస్తే మీమీ జీతాలు అంతవృద్ధి అవుతవి. అందుచే కంపెనీవారికి లాభం వచ్చేటట్లు పనిచేయాలి" అన్నారు. ఇందు మొదటి విషయాన్ని ఎవరూ కాదనరు. కాని మిగిలిన వాని విషయమే చాలా మందికి అనుమానం. అనేక సమ్మెలను వెనుక నడిపించిన గిరిగారికి ఈ ధీమా గలగడం చాలా విచిత్రం.

లాభాలు ఎక్కువైనకొలదీ జీతాలు ఎక్కువ చేస్తారా? యజమానికి ఎప్పుడూ లాభంవచ్చే పద్ధతి మీదనే ఈ పెట్టుబడిదారీ సమాజంలో వుత్పత్తి సాగుతోంది. అది లేకపోతే దోపిడీ విధానమే లేదు. ఈ లాభమే యజమానులకు కూలీలు కల్పించాలంటే; యీ దోపిడీ విధానానికి లొంగుడనియే గిరి గారి వాక్యాలు కార్మికులను కోరుతున్నాయి.

కార్మిక సంఘాల ఐక్యతకై వెనుక గిరిగారు సూచించిన ప్రధాన మయిన వర్గకలహ సిద్ధాంతం గిరిగారు మరువలేదు గదా!

### సమ్మె పాషాణం.

ఇక సమ్మె ఆయుధాన్ని గూర్చి గిరిగారు చెప్పారు. "ఎప్పుడూ ఉపయోగించ కూడదు.... ఆఖరిని వీలైన మందితో సంప్రదించి చేయవచ్చు" ఇంక ఏదారీ లేకయే సమ్మెకు కార్మికులు దిగుతారని గిరిగారికి తెలియదా? యం. యస్. యం. సమ్మె, బి. యస్. రైల్వేలో సమ్మెలు ఎందుకు వచ్చాయి? గత్యంతరం లేకనే గదా? ఇన్ని సమ్మెల అనుభవానంతరం కూడా. యింకా రాయబారాల ద్వారా తమ హక్కులను కార్మికులు సంపాదించుకో వచ్చు అనే అభిప్రాయానికి తావిచ్చేలాగున గిరిగారు మాట్లాడడం సమంజసంగా లేదు. ఇట్టి సలహాలు కార్మికులను నిరుత్సాహ పరచడానికి ఉపయోగిస్తాయి. యిట్టి భాషణలవల్లనే "యజమానులతో కలసి పోయాడు" అని కార్మికులు గాని ఇతరులుగాని దురభిప్రాయ పడవలసి వస్తుంది. గిరిగారు ఇట్టి అవకాశాన్ని కల్పించినందులకు చాల విచారించవలసి యున్నది.

అందుకనే కార్మికుల కష్టాన్నే కాంగ్రెసు ఆలోచించాలి.

"సమ్మె సమయంలో యజమానులు నిలవలోని లాభాలతో హాయిగా గడపడానికి వీలుంది కార్మికుల నెవరూ చూడరు" అన్నారు. లాభాలు వచ్చిన కొద్దీ కార్మికులకు జీతాలిస్తారుగా! గిరిగారి సిద్ధాంతం ప్రకారం! ఇంక సమ్మెలెందుకు వస్తాయి?

కూలీలను హింసించుటకు యజమానులకు యీ విధమగు సావకాశాలున్నాయి గనుకనే కాంగ్రెసు మంత్రులైనా, కార్మికుల హక్కుల విషయమై, పూర్తిగా కార్మికుల పక్షం వహించాలి. యజమానులకు లాభం చేయాలంటే యితరత్రా చేయాలి గాని, కూలీల జీతాలను సౌఖ్యాలను తగ్గించవద్దని సోషలిస్టులు పదేపదే సూచిస్తున్నారు.

గిరిగారి ఈ వింత దృక్పథమే, యం. యస్. యం. రైల్వే సమ్మెలోనూ; బి. యస్. రైల్వే సమ్మెలోనూ, యజమానులు తమ ఇచ్చవచ్చినట్లు ఆడుటకు అవకాశం ఇచ్చింది-ఇప్పుడైనను, యీ భ్రమలను విడచి, కార్మికులకు సంఘీభావము, ఆత్మ విశ్వాసమూ, పోరాటశక్తీ వృద్ధి పొందించే పథాన్ని చేపట్ట వలసినదని గిరిగారిని కోరుచున్నాము.

## మద్రాసు.

### మోటారు బస్సు పనివాండ్ర సమ్మె.

మద్రాసులో మోటారు బస్సు డ్రైవర్లు, కండక్టర్లు, తమకు జీతాలు హెచ్చించి, డ్రైవర్లకు నెల 1కి రు 47-8-0, కండక్టర్లకు రు 30-0-0 ల వంతున యివ్వవలసినదనియు జీతాలు ప్రతి నెలా 3వ తేదీకి ఇచ్చివేయ వలసినదనియు, ప్రస్తుతము పనిలో నున్నవారి వద్దనుండి ధరావతులు పుచ్చుకొన వద్దనియు, యజమానులను కోరిరి. ఒక నెల గడువులోగా యివి నెరవేర్చకపోతే సమ్మె చేస్తామని చెప్పి యుండిరి. యజమానులు డ్రైవర్లకు రు 37-8-0 లున్ను, కండక్టర్లకు రు 22-0-0 లున్ను ఇస్తామన్నారు. ఈ తగాదా యిలా జరుగుతోంది.

ది 24-8-38 వ తేదీ ఉదయం అకస్మాత్తుగా 700 మంది పనివాండ్రు సమ్మె ప్రారంభము చేసిరి. యజమానులు కొంతమంది డ్రైవర్లను కండక్టర్లను తొలగించి వారి స్థానే కొత్తవారిని నియమించుటచే ముందుగా పెరంబూరు పారీస్ కార్నరు లైనులోని బస్సు పనివాండ్రు సమ్మె ప్రారంభించిరి. కొద్ది కాలంలోనే యిది అన్ని లైన్లకూ వ్యాప్తమైనది. మదరాసులో 188 మోటారు బస్సులు ఆగిపోయాయి.

సమ్మె విరమించకపోతే అందరినీ పనినుండి తొలగిస్తామనియు, బస్సులు నడిపి తీరుతామనియు, యజమానులు బెదరించిరి.

తరువాత కార్మిక నాయకులు యజమానులను కలసికొని మాట్లాడిరి. బస్సు కంపెనీల సంఘాధ్యక్షులను లేడెకాగారు యీ దిగువ ఒడంబడికను తాత్కాలికంగా సూచించిరి.

1. కార్మికులు సమ్మెను ఆపుచేయాలి.

2. సమ్మె చేసిన కార్మికులను పనినుండి తొలగించ కుండుట.

3. జీతాల విషయమై తుది పరిష్కారమయ్యేవరకూ యే కంపెనీకూడా పాతవారిని పనినుండి తొలగింపకుండుట.

(మిగతా 18 వ పేజీలో)

# నవశక్తి

31—8—38 బుధవారం


## రైతులారా!

రేపే అఖిల భారత రైతు దినోత్సవం. ఆ నాడు పల్లెలలో, పట్టణాలలో రైతు ఉత్సవాలు జరగాలి. రైతు నినాదాలు ప్రతి ధ్వనించాలి. ఇది మూడవ రైతు దినోత్సవం. ఈ దినోత్సవం గత రెండు సంవత్సరాల కన్న విజయ వంతంగా జరగాలి. దృఢ విశ్వాసంతో జరపాలి.

ఎందుకీ ఉత్సవం? సంపూర్ణ స్వరాజ్యం వచ్చిందనా? కాంగ్రెసు మంత్రుల పరిపాలనచే రైతుల హక్కులన్నియు స్థిర పడినవనా? కోర్కె లన్నియు ఈడేరినవనా? దారిద్ర్యము నశించినదనా? కాదు-కాదు. ఇంకా స్వరాజ్యం దూరంగానే ఉంది. ఫెడరేషన్ పున నెత్తిన రద్దుటకు ప్రయత్నాలు సాగుతూనే ఉన్నాయి. కాంగ్రెసు మంత్రులు కొన్ని సౌకర్యాలు గావించినా, చేయవలసిన వెన్నో ఉన్నాయి. దారిద్ర్య బాధ. ఆకలిమంట. నికృష్ట జీవనము ఇంకా తొలగలేదు. అయితే ఎందుకీ ఉత్సవం? ఎందుకీ కేకలు?

మీ దారిద్ర్య పిశాచాన్ని రూపు మాప సమకట్టడానికే: మీ హక్కుల రక్షణకై ఇంకను తీవ్ర ప్రయత్నములు చేయుటకే: మీ కాంగ్రెసు మంత్రులు మీకు చేసిన సదుపాయములు గాక, ఇంకా కావలసిన - రావలసిన సౌకర్యాలను, హక్కులను పొందడానికే: అమానుషమూ, అనాగరికమూ అయిన భూస్వామ్య జమీందారీ పద్ధతుల నాశనం చేయడానికే: వందల తరబడి పీడించు ఋణ దాతల, సామ్రాజ్య వాదుల పిడికిలి నుండి బయట పడటానికే; ఈ ఉత్సవం, ఈ యాత్ర.ఇది కార్మికుల మే దినోత్సవం లాంటిది మీకు. ఇది భారతీయులందరి స్వాతంత్ర్య దినము లాంటిది మీకు. రైతులారా! లేవండి! నిద్ర మేల్కొండి!! మీ బలాన్ని — దృఢసంకల్పాన్ని తెలియ జేయండి!!!

భారతదేశ మంతటా రైతు వర్గము మేల్కొన్నది. అఖిల భారత రైతు సంఘం ఏర్పడి మూడేండ్లయినది. ఈ మూడేండ్లలోనూ మీ సోదర రైతులలో ఎంతో చైతన్యం, ఆత్మ విశ్వాసం, ఏర్పడింది. ఈ రైతు సంఘాల జూచి జమీందారుల గుండెలలో రైళ్ళు పరుగెత్తుచున్నాయి. సంస్థానాధీశులకు నిద్ర పట్టడంలేదు. ఈ మహా విప్లవ చైతన్యాన్ని చూచి, సామ్రాజ్యవాదం హడలి చస్తున్నది. కాంగ్రెసులో ధనాఢ్యుల, జమీందారీ శక్తుల కన్నెఱ్ఱ పడింది. ఒక్కుమ్మడి దేశ మంతటా రైతులపై ఈ శక్తులన్నియు దాడి సాగించినాయి.ఈ దాడి నెదుర్కొంటానికి రైతు ధైర్యముగ, విశ్వాసముతో, పోరాడుచున్నాడు. ఆ పోరాట చరిత్రమే దేశమంతటా ప్రత్యక్ష మౌతున్నది. ఈ ఘర్షణల—పోరాటాల ఫలితం ఏమిటి?

బెంగాలులో ఫజ్లుల్ హక్కు ద్రోహం చేశాడు రైతులకు. పంజాబులో తీవ్ర నిర్బంధ విధానం కొనసాగుతూంది. రైతు ఉద్యమం తల ఎత్తకుండా చేయడానికి ప్రయత్నాలే గాక, రైతులను సామ్రాజ్యవాద యుద్ధాలలోకి త్రోసి చంపడానికి ఆశల పెట్టే సంస్కరణలు, బిల్లులు కొని రాబడినాయి. సింధు ప్రభుత్వం రైతు ఉద్యమ ఫలితంగా క్రొత్తగా వేసిన పన్నులను తాత్కాలికంగా తగ్గించింది. ఇక కాంగ్రెసు రాష్ట్రాలలో చూద్దాం. యు. పి. లో జమీందార్ల దౌర్జన్యానికి-సత్యాగ్రహం చేస్తామనే బెదరింపులకు లొంగక, యు. పి. కిసాన్ సోదరులు తమ హక్కులకై పోరాడి, జయించ గల్గారు. బీహార్‌లో కాంగ్రెస్ మంత్రి వర్గం, జమీందార్లతో ఒడంబడికకు దిగి, రైతుల అసమ్మతికి గురి అయింది. ఒరిస్సాలోకాంగ్రెసు మంత్రులు రైతులకు గావించ వలచిన సహాయానికి గవర్నరు అడ్డు దగులుచున్నాడు. మద్రాసులో ఋణ నివారణ చట్టము లభించింది. భారత దేశ కర్షకుల ఈ చరిత్ర అంతా గమనించండి! మీ సోదరు లే యే రాష్ట్రాలలో, ఏ యే పోరాటా గావించారో తెలిసికొనండి. ఏ యే లోపాలు గావించారో విచారించండి. రైతు ఉద్యమ చరిత్ర నంతా సింహావలోకనం గావిస్తూ, రేపు మీ కర్తవ్యాలను నిర్ణయించండి! అందుకే ఈ అఖిలభారత రైతు దినోత్సవం.

ఒక సారి మన ఆంధ్ర దేశ రైతు ఉద్యమాన్ని గూడ సింహావ లోకనం చేద్దాం. 1921 లో నాన్‌కో ఆపరేషన్ ఉద్యమం వచ్చింది. తత్ఫలితంగా రైతులలో సంచలనం గల్గింది. పల్నాడులో పన్నుల నిరాకరణం ప్రారంభ మయింది. కాని, 21 లోని సత్యాగ్రహం వలెనే దోవ తెన్నులు లేకుండా ఆ ఉద్యమం విడిచి పెట్టబడింది. కాని ఇంతటితో ఉద్యమం నశించ లేదు. సంఘటితము కాక పోయినా, రైతు లోకంలో ఆవేదన నశించ లేదు. అందుకు నిదర్శనం 1923 లో నిడుబ్రోలులో, 1928 లో గుంటూరులో, 1929 లో బెజవాడలో, 1931 లో బాపట్లలో, రైతు మహా సభలు జరిగాయి. ఈ సభల ద్వారా రైతులలో- అంత బల వత్తరముగా కాక పోయినా—సంఘీ భావం హెచ్చింది. కొంత ఆందోళన బయటను, కొంత శాసన సభలలోను రైతుల కష్టాల గురించి సాగింది.

మరల 1930 లో సత్యాగ్రహోద్యమం రైతులను మరింత కదలి వైచింది. ఋణ బాధలతో, జమీందార్ల దౌర్జన్యాలతో భూముల నుండి తరుమ బడిన రైతుకు, అధిక శిస్తులకు కొంప గోడెము లమ్ముకొనే రైతుకు, స్వాతంత్ర్య శంఖారావము కొంత కదలిక కదిలించింది. కాని, ఆ శంఖారావము స్పష్టంగా లేదు. అతని దైనందిన కోర్కె లేమిటో స్పష్టంగా వివరించ లేదు. అయినా, కొంత ఆశతో రైతు ముందుకు దుమికాడు.

ఇంతలో రీసెటిల్‌మెంటు ఆందోళనతో రైతు లోకం మేల్కొన్నది. ఆందోళన నణచడానికి ఆ నాటి రైతు నాయకులను జైళ్ల కంపింది ప్రభుత్వం.

1933 లో జమీన్ రైతు సంఘం ఏర్పడి విచారణ గావించింది. అంతకు మునుపే రెండు మూడు సంవత్సరాలనుండి వెంకటగిరి జమీందారీ ప్రజలు ఆందోళన చేస్తూ వచ్చారు. ఆ నాటి విచారణ కమిటీ ఆంధ్ర దేశ జమీన్ రైతుల కోర్కెల జాబితా నొకటి ఇచ్చి దేశంలో ఆందోళన గావించింది.

ఎప్పటి నుండో తీవ్రంగా పని చేస్తున్న ఆంధ్ర రైతు సంఘాలు, లక్నో కాంగ్రెసు సమయాన ఏర్పడిన అఖిల భారత రైతు సంఘ ఫలితంగా, మరింత బల పడినాయి. ఆ నాటి నుండి నేటి వరకు, రైతు లోకంలో, ఒక సక్రమ విధానంతో ఆందోళన, చైతన్యం గావిస్తూ ఎడలేని సేవ చేసింది రాష్ట్రి రైతు సంఘం.

కాంగ్రెసు మంత్రి వర్గాలు ఏర్పడక ముందే. వెంకటగిరి, బొబ్బిలి, పిఠాపురం, చల్లపల్లి మొదలగు జమీందారీలలో రైతులు తీవ్రంగా అణచబడిన తమ కోర్కెలకై పోరాటానికి తల లెత్త సాగారు. రైత్వారీ ప్రదేశాలలో, ఎక్కుగా కాంగ్రెసు వలన గల్గిన చైతన్యంతో తమ ఆందోళనతో ముందుకు సాగిపొయ్యేవారు.

కాంగ్రెస్ ఎన్నికలు వచ్చాయి. జమీందారీ ప్రదేశాలలో ఆశ్చర్యకరమైన మార్పు వచ్చింది. ఎంతో విప్లవ చైతన్యం కల్గింది. కాంగ్రెసు సంస్థ యెడల తమ అపార విశ్వాసాన్ని చూపారు రైతులు. సామ్రాజ్యవాదానికీ, జమీందారీ విధానానికీ తమ తీవ్ర విముఖతను చూపారు. జమీందారీ వర్గం ఎన్నికలలో తుడుచుకపోయింది.

కాంగ్రెసు మంత్రివర్గం వచ్చిందని,తమ కష్టాలు తీర్తాయని ఉవ్విళ్లూరారు. ఆందోళన గావించారు. కొంత ఫలించింది. మద్రాసు ఋణ నివారణ చట్టం వచ్చినది. కాని పరపతి కల్పించక పోవడం వల్ల, తగిన సహాయం కల్గలేదు. జమీందార్లకు మగతా చెల్లించు విషయంలో రయితు కొంత ఇబ్బంది పడవలసి వచ్చింది. అయినా కొంత మేలే అనాలి. ఇంత దూరం ఆంధ్ర రైతాంగాన్ని నడిపించడానికి, రైతాంగ విద్యాలయాలు, వేసవి పాఠశాలలూ, రైతు యాత్రలూ, రైతు, సోషలిష్టు ఉద్యమాలూ సహాయపడ్డాయి. రైతులారా! ఇది మీ పూర్వ చరిత్ర.

కాని ఇంతటితో రైతుల కోర్కె లీడేర లేదు. చైతన్య మందిన రైతులపై జమీందార్ల. మొఖాసాదార్ల దౌర్జన్యం పెచ్చు పెరుగుతోంది. జమీందారీ విచారణ సంఘ మేర్పర్చిన కాంగ్రెసు ప్రభుత్వం ఇంకా జమీందారీ రైతులకు సహాయంగావించే శాసనం తీసుక రాకపోవడం వల్ల, జమీన్ రైతులు నానా కడగండ్లు పడవలసి వస్తున్నది. నేడెటు చూచినా జమీందారీ దౌర్జన్యం గోచరిస్తున్నది. ఉత్తరాన చూసి, జలంతర్‌లలో; పశ్చిమ గోదావరిలో కాశీపట్నం, చింతలపూడి తాలూకాలలో; కృష్ణాలో, మునగాల, ముక్త్యాల, గంపలగూడెం, నందిగామ,తిరువూరులో,జమీందార్లతో ప్రత్యక్ష పోరాటానికి తయారు గావలసి వచ్చింది. రయిత్వారీ ఏరియాలలో, పి. డబ్ల్యు. డి. లంచగొండితనం పెనాల్టీలు—నజరానాలు మొదలగు బాధలను ఎదుర్కొవలసి వచ్చింది.

జమీందారీ, రయిత్వారీ ప్రదేశాలలోని ఈ కష్టాలనూ—పోరాటాలనూ ఏకత్రితం జేసి, మీ హక్కులను వెల్లడించే దినమే ఈ రయితు దినోత్సవం.

జమీందారీ రైతులబాధలు నివారించడానికి, రాష్ట్రి కాంగ్రెసు కమిటీ విచారణ సంఘం కొన్ని సూచనల గావించింది. ఇలాంటి సూచనలే, రైతు యాత్రా దళం వారు మద్రాసు ప్రభుత్వానికి విన్నవించిన నివేదికలో సూచించారు. పాలకొల్లులో జరిగిన సోషలిస్టుపార్టీ మహాసభకూడ ఇలాంటి సూచనలు గావించింది. అన్నిపక్షాలు, ఏకగ్రీవంగా అంగీకరించిన ఈసూచనల నంగీకరించి శాసనం గావించాలసిన బాధ్యత కాంగ్రెసు ప్రభుత్వానిది. జమీన్‌రైతుల సహాయానికి శాసనం వస్తుందని జమీందారులప్పుడే జాగ్రత్త పడు చున్నారు. మంత్రి వర్గాన్ని బెదరించడానికి, వంచడానికి ఎన్ని ఎత్తులు ఎత్తారో అన్నీ చేస్తా రనడానికి సందేహం లేదు. అందుకోసం ఈ నాటి నుండీ ఈ సూచనల కనుకూలంగా తీవ్రమైన ఆందోళన సల్పాలి. వివాదాలు లేని సమస్య పట్ల. రాష్ట్రి కాంగ్రెస్ సంఘం, రైతు సోషలిస్టు పక్షాల సహకారంతో, ఒక రోజు నిర్ణయించియో, ఇంకా ఇతర విధాలనో, ఆందోళన చేయాలి. రాష్ట్రి కాంగ్రెసు సంఘం అలా చేయాలని కోరడం రైతులగు మీ అందరిదీ నిధి. అందుకు అదను కూడా ఈ రైతు దినోత్సవమే.

రేపు, ప్రతి పల్లెలో ఉత్సవాలు, యాత్రలు, జరిపి, మీ బలం ప్రదర్శించండి. కాంగ్రెసు మంత్రులకు మీ సహకారంతో పాటు శక్తిని చూపండి. శత్రు వర్గాలు అదరి పోయేటట్లు, మీ మీ కష్టాలను నివారించు కొనేందుకు—హక్కులు రక్షించు కొనేందుకు—ఎలుగెత్తి ఈ నినాదాలు పల్కండి:

సామ్రాజ్యవాదం నశించుగాక! జమీందారీ విధానం నశించుగాక! లంచగొండితనం నశించుగాక! అప్పులు రద్దు గావాలి! పన్నులు తగ్గాలి!



# సరిహద్దులో రైతుల సత్యాగ్రహం

## ఆంధ్ర జమీందారీలలో దౌర్జన్యం—బొంబాయి రైతు చట్టం—బీహార్ ఒడంబడికకు ప్రతికూలత

### తిరువూరు తాలూకా.

తిరువూరు ఎస్టేటు, రాజు పేట గ్రామంలో ఒక చెరువు కట్ట మీద ఉన్న తుమ్మ చెట్టునుండి ఒక రైతు ఒక తొడుగు కంప కొట్టుకున్నాడని అతనికి జరిమానాగా, 50 రూపాయల నుండి బేరం పెట్టి, 30 రూపాయల జరిమానా వసూలు చేశారు జమీందారు గారు.

స్వామీ సహజానంద సరస్వతి;

అఖిల భారత రైతు దినోత్సవం (సెప్టెంబర్ 1) జయప్రదంగా జరపాలని విజ్ఞప్తి గావించినారు.

[illegible] మాలు చెల్లించి కట్టెలు నరకుకొన్నప్పటికీ, వాయిదాలోగా రైతు ఆ కట్టెలను వర్షముల యిబ్బంది వల్ల తెచ్చుకోలేకపోతే, జమీందారు గారి బంధువులైన కోటగిరి వెంకట్రాయణం గారు ఆ కట్టెలను మల్లేల గ్రామం తీసుకు వెళ్లారు. వర్షముల యిబ్బంది వల్ల తెచ్చుకొనలేకపోతిని కాబట్టి, తిరిగి నా కట్టెలు నాకు యిప్పించవలసిది, లేదా తమకు చెల్లించిన మాలు, నరుకుడు కూలి వెంకట్రాయం గారి వల్ల యిప్పించవలసిందని సదరు రైతు గంపల గూడెం జమీందారు గారికి వ్రాసుకొన్నాడు.కాని, ఎంతకాలమైనా జవాబు శూన్యం.

రైతులను హింసించవలెననే పట్టుదలతో, గంపల గూడెం, తునికిపాడు యెస్టేటు జమీందార్లు రైతుల తాలూకు పశువులు దార్ల వెంట వెళ్లుచున్నా, రైతుల అనుభవంలో ఉన్న భూములలో మేస్తున్నా, రోజుకు వందలు వందలుగా పశువులను తొండు దొడ్డికి తోలుతున్నారు.

చిట్టేల గ్రామంలో పశువులను మేపు కొనుటకు యిచ్చిన పుల్లరి చీట్లన్నీ లెఖ్ఖలు వ్రాసుకోడానికని జమీందారు-గారి ఉద్యోగస్థులు తీసుకొని,తిరిగి ప్రజలు వాటిని అడిగి నిప్పటికీ యివ్వడంలే లేదు.

రైతుల పొలాలు పాడు చేసినందుకు జమీందారు గారి బంధువులకు చెందిన పశువులను పొందు దొడ్లో పెడితే, ఆ దొడ్డి తాళం బలవంతంగా తీసివేసి, పదిమంది జనం యొక్క సహాయంతో పశువులను తోలుకొని వెళ్ళారు. గవర్నమెంటు ఉద్యోగి అడ్డం బోతే, "ఖబర్దార్—జాగ్రత్త" అని బెదిరించి పశువులను తోలుకొని వెళ్ళారు.

### మునగాల ఎస్టేటు.

ఈ నెల 19 వ తేదీ రాత్రి సుమారు 8 గంటలకు 20 మంది రౌడీలను తప్ప త్రాగించి, జమీందారు గారి హవల్‌దారు తుపాకులతోను, కత్తులతోను కర్రలతోను రామచంద్రపురం వచ్చి, ఒక రైతు గొడ్లను మేపుకొని తన తమ్మునితో వస్తూండగా, అతనిని డొంకలో పట్టుకొని కింద పడవేసి, నోట్లో గుడ్డలను కుక్కి, చావమోది యీడ్చి వేశారు. అటువైపు వస్తూన్న గ్రామస్థులను చూచి తుంటరులు గుట్టలలోనికి పారిపోయారు.

21 వ తేదీని పోలీసు యిన్‌స్పెక్టరు గారు కేసు విచారించుటకని ఆ గ్రామం వెళ్లారు. కాని, ఆయన ఠాణేదారు — మరి నలుగురైదుగురి జమీందారీ ఉద్యోగస్థులను వెంట బెట్టుకొని పొలములలో

### రైతులోకం

తిరిగారు. దెబ్బల తిన్న రైతులను విచారించనే లేరు.

మరునాడు ఇన్స్పెక్టరుగారు వారిని జగ్గయ్యపేట పోయి డాక్టరు సర్టిఫికెట్ తెచ్చుకో మన్నారు. వారు "మా వద్ద డబ్బు లేదు, పేద వాళ్ళము" అన్నారు "నేను పంపిస్తాను, రండి" అని ఇనస్పెక్టరుగారు చెప్పి, ఒక రూపాయ మాత్రమే యిచ్చి, మిగిలినది ఒక కాంగ్రెసు వర్కరును ఇవ్వ మన్నారు. సరే నని రెండు రూపాయలు కాంగ్రెసు సంఘం నుండి యిప్పించాడు. తిరిగి వచ్చేటప్పుడు కారు ఎక్కించుకు తీసుకు రమ్మని ఒక పోలీసును వెంట పంపాడు. జగ్గయ్యపేటలో డాక్టరు లేడు. ఆ రైతులను కారు ఎక్కించకుండా, కారు రేటు ఇవ్వకుండా ఇనస్పెక్టరుగారు పోలీసు జవాన్‌తో తిరిగి వచ్చేశారు. రైతులు దెబ్బల బాధతో నడిచి వచ్చారు.

పసి పాపలమీద రాళ్లు.

21-8-38 వ తేదీ రాత్రి 7 గంటలకు మునగాల గ్రామంలో 12 సంవత్సరములు మించని బాలురు జాతీయ పతాకములతోను, జాతీయ గీతములతోను ఊరేగింపుగా పోలీసు స్టేషను వద్దకు వచ్చారు. జయ ధ్వనాలు మిన్ను ముట్టుతున్నాయి. ఇంతలో [illegible] ఒక [illegible] లుకు తగిలింది. [illegible]

పిల్లలంతా అతనిని ఓదారుస్తూంటే, మరొక రాయి వచ్చి మరొక బాలుని కనుబొమ్మమీద తగిలింది. బలమైన గాయం అయింది. రక్తం ధారగా ప్రవహించింది. "పోలీసు స్టేషను నుండి రాళ్లు వస్తున్నాయిరోయ్!" అంటూ పిల్లలు కాంగ్రెస్ శిబిరానికి పరుగెత్తుకొని వెళ్లారు. "రాళ్లు ఎటునుండి పడ్డాయి?" అని అడిగితే, "పోలీసు స్టేషను నుండి" అని వారి జవాబు.

ఈ దుర్మార్గం పోలీసు స్టేషను యందలి పోలీసులైనా చేసి ఉండాలి. (ఎందువల్ల నంటే, పిల్లలు "పోలీసుల లంచ గొండితనం నశించుగాక!" అని కూడ అరచారు). లేక జమీందారు యొక్క తుంటరులు చేస్తూంటే పోలీసులు వారికి ప్రోత్సాహం అయినా చేసి ఉండాలి, (ఎందువల్ల నంటే, పోలీసు స్టేషను అక్కడికి కొన్ని అడుగుల దూరంలోనే ఉన్నది). లోకజ్ఞానం యెరుగని పసి పాపలకు ఇంతకంటే వేరు శత్రువులుంటారని యెవరూ ఊహించలేరు.

మునగాల ఎస్టేటులో జమీందారీ నౌకర్లు రైతులపై చేస్తూన్న అత్యాచారముల విషయమై పోలీసులు మొదటినుంచీ రైతులను ప్రతికూల వైఖరితోనే చూస్తున్నారు. పైగా కాంగ్రెసు మెంబర్లను చేర్పించుటకు వచ్చిన యువకులపై అనేక అపనిందలు వ్యాపింపజేస్తున్నారు. కాంగ్రెసు సభ్యత్వ రుసు మంతా కాంగ్రెసు నాయకులు త్రాగుడు, సినీమాలు, కార్లు,ఉంపుడుకత్తెలు మొదలైన దుర్వినియోగములకు ఉపయోగిస్తారని నిర్భయంగా, సబ్ యినస్పెక్టరు, కానిస్టేబిల్సు ప్రచారం చేస్తున్నారు.

కాంగ్రెసు సభ్యత్వ రశీదులు పొట్లాలకు కూడా పనికిరావని హేళనగా మాట్లాడుతున్నారు.

పోలీసు ఉద్యోగులు కాంగ్రెసు సంస్థను దూషించుట; ఎస్టేటు వారిపై రైతులు చేయు ఛార్జీలను విచారణ చేయుటలో ఆలస్యం చేయుట; విచారణకాలంలో జమీందారు బండ్లను,బంగాళాను ఉపయోగించుకొనుట; జమీందారు గారి కోటకు వెళ్లి అక్కడ భోజనాది ఫలహారముల స్వీకరించుట పరిపాటై పోయింది.

జమీందారీ నౌకర్లు చేసే క్రౌర్యాలకు రైతులు గురియై, పోలీసు స్టేషన్‌కు రిపోర్టు చేయడానికి వస్తే, కాంగ్రెసు ఆఫీసులో గాని, గాంధీ గారితో గాని చెప్పుకోండి అంటూ కాంగ్రెసు యెడల యిష్టం వచ్చిన పరుష వాక్యము లాడుతున్నారు.

పోలీసుల యిట్టి వైఖరిని ఊతగా తీసుకొని జమీందారీ నౌకర్లు ఆడే ఆటలకు పట్ట పగ్గాల్లేకుండా పోతున్నాయి. [illegible] జమీందారీ నౌకర్లు, తుంటరులు కాంగ్రెసున్ను తిట్టే తిట్లకు అంతు లేదు.

పోలీసు ఉద్యోగులు ప్రజలను [illegible] ప్రతి కేసులోనూ ప్రజలే తప్పు చేసి [illegible] దృష్టితోనే విచారణలు చేస్తున్నారు. [illegible]

(మిగతా 16 వ పేజీలో)

# గ్రంథావలోకనము

## నెహ్రూ చరిత్రము గాంధీ చరిత్రము

రచయిత కొమాండూరి శఠకోపాచార్యులు ఎం. ఏ. బి. యల్. కాకినాడ. గ్రంథకర్త గారి పేర కాకినాడ వ్రాసిన పుస్తకములు బడియగలరు.

రెండు పుస్తకములలోను ఫొటోలున్నవి. అట్టలపై నెహ్రూ, గాంధీల బొమ్మలున్నవి. కాగితము మంచిది. ఒక్కొక్కటి 200 పేజీల గ్రంథం. వెల ఒక్కొకటి అర్ధ రూపాయి మాత్రమే.

* * *

రచయిత, నెహ్రూ, గాంధి గారల ఆత్మ కథల సారాంశమును స్పష్టపరచియు, తరువాత విశేషముల చేర్చియు, సులభమైన భాషలో వ్రాశారు.

గ్రంథకర్త గారు ఎవరి చరిత్ర వ్రాయునపుడు వారి భావాలను సమర్థింప ప్రయత్నించి, ఆ భావాలకు తమ సిద్ధాంతాలను చేర్చకుండాలని కృషి చేసి విఫలు లయ్యారు. నెహ్రూ చరిత్రలో జవహర్‌లాలు మతమును నమ్మనని స్పష్టముగా చెప్పుచుండ, అతని సోషలిస్టు అభిప్రాయాలను బౌద్ధమత సూత్రాలతో సమన్వయింప జూచారు. వెల్సు, నెహ్రూల ప్రపంచ చరిత్రల పోల్చుతూ "కొన్ని సంగతుల తన యుద్దేశమున కవసరము కానందున" నెహ్రూ గారు వదలివేసారని వ్రాసారు. నెహ్రూగారు ప్రపంచ చరిత్రను, సోషలిస్టు దృక్పథముతో వ్రాసారు. వెల్సు కేపిటలిస్టు దృక్పథముతో వ్రాసాడు. అతడు మానవ సమాజ చరిత్రను కేపటలిజం వరకు పరిణామముగా అంగీకరించి తరువాత మెట్టగు సోవియట్ ప్రభుత్వాన్ని నాగరితా విరుద్ధమని త్రోసివేసాడు. అనగా అతడును కేపిటలిస్టు సమాజాన్ని సమర్థించు ప్రచారకుడే గదా! గ్రంథకర్తగారు యీ సంగతి గుర్తించినచో కళకోసం కళ అనే వృథా ప్రయత్నం చేసేవారు కాదు.

గాంధీ చరిత్రలో వారి భావము లన్నిటిని తెల్పుచూ, (154 పేజీ) అవి విఫలమైనపుడు రాజకీయ పోరాటమును పెడమార్గము పట్టించి నవుడు, ఆచర్యలు హేతువాదనకు నిలువనప్పటికీ, అంతరాత్మ సహజ బోధితములని సమర్థించారు.

"జమీందారీ పద్ధతి వుండాలి. కేపిటలిస్టులు ధర్మకర్తలు" అనే గాంధిగారిని గొప్ప సామ్యవాది అంటున్నారు. వీరు గాంధిజానికి సోషలిజానికి భేదాన్ని గుర్తించినచో యిటులనుట విచిత్రమే! వీరు ఇంకొకచో (169) వీరు "లెనిన్ పద్ధతిలోనూ, ముసోలినీ హిట్లరు పద్ధతులలోనూ, వ్యక్తి స్వాతంత్ర్య మడుగంటుచున్నది" అని వ్రాసారు. తెలియని సంగతులు ఉదాహరణంగా తెచ్చుట సాహసమని చెప్పాలి. ముస్సోలినీ, హిట్లర్లు, కేపిటలిజానికి ఆఖరి మెట్టగు సామ్రాజ్యవాద సంరక్షకులనియు, లెనిన్ కార్మిక వర్గము స్థాపించబోవు నూతన నాగరికతయగు కమ్యూనిజంకు మార్గమగు మొదటి సోషలిస్టు ప్రభుత్వాన్ని స్థాపించిన కార్మిక నాయకుడని గమనించిన, తెలిసిన, కలగాపులగంగా ఆ వాక్యమటుల వ్రాసి యుండరు.

నాన్‌కోపరేషన్‌కు వీరు అసహకారమని వాడారు. కాని సహాయనిరాకరణమను మాటయే ప్రచారంలో వున్నది గాన సుగమంగా తోచుతుంది.

## అన్నా

(బారికేడ్స్ ఇన్ బెర్లిన్)

గ్రంథకర్త:—క్లాస్యూ క్రాంజ్

అనువాదకుడు:— అశ్వినీ కుమార దత్తు

290 పేజీలు. వెల ఎనిమిది అణాలు. ప్రకాశకులు దర్భా శ్రీరామమూర్తి. భీమవరం. పశ్చిమ గోదావరి జిల్లా.

* * *

బెర్లిన్ కార్మికులు 1929 మే 1వ తేదీన అంతర్జాతీయ కార్మిక దినోత్సవం జరుపుతూంటే సోషల్ డిమాక్రేట్ పార్టీ నాయకులు పదవుల్లో వుండి ఆ వుత్సవాన్ని నిషేధించారు. తత్ఫలితంగా జరిగిన సంఘటనలు, పోలీసు అఘాయిత్యం, దాన్ని ఎదుర్కొడానికి, కార్మికుల సాయంతోనే పైకివచ్చి, కాపిటలిస్టు పాలనా యంత్రంలో ఒక భాగమగు పోలీసు ప్రెసిడెంటు అయిన కామ్రేడ్ జార్జిబెలో జేసిన మోసం, తమ పార్టీ (సోషల్ డిమాక్రేట్ పార్టీ) సమయంలో మార్గం చూపించకపోవుట, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం వహించి నడుపుట, యివన్నీ కండ్లకు కట్టినటుల వర్ణించు నవల.

"నిరంకుశ ప్రభుత్వాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు కేవలం, విప్లవకారుల కార్యక్రమ పట్టికల్లోనూ బుర్రల్లోనూ భావనామాత్రంగానే అభివృద్ధి చెందడం లేదు. స్వాభావికంగానూ, ఆచరణ యోగ్యంగాను, ఉద్యమం యొక్క తప్పని సరియైన తరువాత మెట్టుగాను పరిణమిస్తుందని ఉట్టి సంఘటనలు స్పష్టంగా చూపుతాయి. ప్రజా సమూహముల వృద్ధిపొందుతూన్న కోప అనుభవ సాహసాల ఫలితమే సాయుధమగు తిరుగుబాటు" అన్నాడు లెనిన్. ఈ మాటలలోని నిజాన్ని రుజువు చేసింది 1929 మే దినం బెర్లిన్‌లో. "కైజరు వంటి వాని పద్దనుండి బలవంతంగా సంపాదించుకొన్న ఒక హక్కును ప్రజా తంత్రములో (డిమాక్రసీలో) కార్మికులు వదలుకొంటారా?" "ప్రభుత్వోద్యోగాలలో నుండి వారి సొమ్ము తింటూ పెట్టుబడిదారీ విధానానికి పెనవేసుకుపోయిన"-సోషల్ డిమాక్రేటు అయిన-పోలీసు ప్రెశిడెంటు నిషేధాన్ని-శాంతియుతంగా ఉల్లంఘించడానికి 'కోలిన్ స్ట్రాసీ' కార్మికులు నిర్ణయించారు. నిరాయుధులైన కార్మికులు, పిన్నలు, వృద్ధులు, పిల్లలతిల్లులు అంతా ఊరేగింపు ప్రారంభించారు. పోలీసులు ఆయుధ సహితులై వచ్చి, నిరపాయమైన ఆ వూరేగింపును అడ్డగించారు. స్త్రీల, పిల్లల అందరిపై లాఠీఛార్జీ చేశారు. వారి పతాకాలను వూడబెరికారు. స్వరక్షణకై ఎదిరించి నిలచిన వారిపై తుపాకులు పేల్చారు.

"మీరు మొగాళ్ళేనా? మీ పిల్లన్ని పెళ్ళాల్ని పోలీసు గుళ్ళకు ఎరగావిస్తూంటే చూస్తూన్న పిరికి పందలు, దద్దమ్మలు!" అన్నారు శాపనార్థాలు పెడుతూ స్త్రీలు, కార్మికులను. పోలీసుల వీధిలోనికి రాకుండా చెయ్యాలని నిర్ణయించుకొన్నారు కార్మికులు. వెంటనే వీధికి రెండువైపులా బారికేడ్సు (అడ్డు గోడలు) లేచాయి. కార్మికులు తమకు దొరికిన ఆయుధమల్లా సేకరించి స్వరక్షణకు తయారయ్యారు. సైన్యాలు మరఫిరంగులు తయారయ్యాయి. ఒక చిన్న అంతర్యుద్ధం జరిగింది. ఇందు జయమెవ్వరిదో చెప్పాలా?

తమ పార్టీకి పునాది అయిన కార్మిక జన ఉత్సాహ ఉద్రేకాలను అడంచుటకు, అధికార ఛాయల్లోవుండి కాపిటలిజానికి సాయపడిన సోషలో డిమాక్రేట్ పార్టీ, తరువాత నాజీ నియంతృత్వంచే నాశనం గావించబడినదని చరిత్ర చెబుతోంది.

ఈ నవలలో 'కథానాయిక' అన్నా', భర్త 'కర్టు', కమ్యూనిస్టు నాయకుడు 'హెర్మన్' కమ్యూనిస్టు యువజన సభ్యుడు 'ఆటో' వీరు వహించిన పాత్రలు, బూర్జువా పత్రికల అసత్య ప్రచారం, పీడిత కార్మిక కుటుంబాలు పడ్డ వెతలు చక్కగా వర్ణింప బడ్డాయి. చదువుతూంటే వుత్సాహం వుద్రేకం కలుగుటే గాక భారత స్వాతంత్ర్య పోరాటానికి మనమింకా ఎన్ని విధాల తయారు కావాలి అనే ఆలోచన ప్రస్ఫుటిత మౌతుంది.

అనువాదకులు బారికేడ్ (Barricade) కు 'అడ్డుగోడ' అని వాడారు. అసలు పదాన్నే వాడి ఫుట్ నోట్‌లో అర్థాన్ని వివరంగా వ్రాస్తే బాగుంటుంది. వ్యవహారిక భాషనే వాడారు. ప్రథమ ప్రయత్న మగుటచే కాబోలు ప్రవాహం లేదు. అచ్చటచట భాష కుంటు వడినది. ప్రకాశకులు పంప్పు యేషనుకు ఇంకా ఎక్కువ శ్రద్ధ తీసికోవాలిసింది.

ఇటువంటి గ్రంథాలు పోరాటంలో ఎంతో వెనుకబడిన మనకు అవుసరము. ప్రకాశకులు 290 పేజీ గ్రంథాన్ని స్వల్ప ధరకు 8 అణాలకి ఆంధ్రుల కర్పించి నందులకు మా అభివందనాలు. ప్రొలిటేరియన్ సీరీస్‌లో యింకా యిటువంటి "పీడిత జనుల విముక్తికొరకు జరుగు పోరాటాల గురించిన సాహిత్యం" ప్రకటింపు తారని ఆశించుతాము.

## పట్టాభిగారి 'సోషలిజం'

రచయిత, ప్రకాశకులు గోపీచంద్: సూతాశ్రమం తెనాలి. 35 పేజీలు. వెల తెలియదు. 16 పేజీల ఉపోద్ఘాతం వుంది.

*

సజీవమైన భాష: జోరుగా ప్రవాహంలా పరుగెత్తుతూంది. పట్టాభిగారు తానూ సోషలిస్టునని అపుడపుడూ అంటూ అనేక సందర్భాలలో యిచ్చిన ఉపన్యాసాలు, వ్రాసిన వ్యాసాలలో సోషలిజాన్ని తమ కిష్టం వచ్చినటుల చేసిన వ్యాఖ్యానాలలో, శాస్త్రీయ సోషలిజం ఏమీ లేదని నిరూపించడానికి ప్రయత్నించారు గ్రంథకర్తగారు. పుస్తకం ఉద్దేశ్యం అదిమాత్రమే అయినచో జయం పొందారనే చెప్పవచ్చు.

ఉపోద్ఘాతంలోనే గ్రంథకర్తగారు 'సోషలిజం, అంటే 'సామ్యవాదం' అని చెప్పుకోవటంలోనే ఈ ఉద్యమానికి పెద్ద దెబ్బ అన్నారు. సోషలిజాన్నే ఇతర దేశాల్లో కూడ అనేకులు అనేక రకాలుగా అర్థాలు చెప్పారు. ఫేబియన్ సోషలిస్టు బెర్నార్డుషా, సోషలిజంలో వేతనాల్లో సమానత్వం ఉండాలన్నాడు. అటులే ఇచటా సోషలిజం అంటే సమత్వం అని కొందరికి అభిప్రాయం వుంది. అంతేగాని సామ్యవాదం అనే పదంలో ప్రత్యేకంగా వచ్చిన పెద్ద దెబ్బ ఏమీలేదని తలుస్తాము. సోషలిస్టు సమాజంలోనూ, తదనంతరం వచ్చే కమ్యూనిస్టు సమాజంలోనూ స్వాభావిక భేదాలుంటాయినీ, మొదటిదాంట్లో పని నమసరించి కూలియు, రెండవదాంట్లో "చేతనైనంత పని చేయుటఅవసరమైనంత ఉపయోగించుకొనుట" జరుగుతుందనీ, రెంటిలోనూ సమాజంలో అందరికి అభివృద్ధి చెందడానికి సమాన అవకాశాలుంటాయనీ తెలియజెప్పుట సోషలిస్టుల విధి.

గోపీచంద్‌గారు అందంగా వ్రాయాలనే హుషారులో వెక్కిరింపుల కెక్కువ ప్రాధాన్యత యిచ్చారని తలుస్తాము. 13 వ పేజీలో "పట్టాభి కామధేనువునీ........ అల్లావుద్దీన్ లాంతరు సంపాదించి ఎన్ని గమ్మత్తులు చేసినా సోషలిస్టులుకారని సవినయంగా మనవి చేసికొంటున్నాము" అన్నారు. ఇది స్థాయికి తగ్గిపోయిన విమర్శ. ఏ గమ్మత్తులూ చేయనక్కరలేదు. మార్క్సిజాన్ని అర్థం చేసుకొని అంగీకరించి, సోషలిజం స్థాపనకొరకు పనిచేయబూనిన అందరూ సోషలిస్టు లౌతారు. పట్టాభిగారూ కాగలరు.

పట్టాభిగారి సోషలిజం, మార్క్సు కమ్యూనిస్టు మ్యానిఫెస్టోలో చేసిన విభజన ప్రకారం, కార్మికుల—రైతుల వైపు వీరి దృక్పథాన్ని అనుసరించి బూర్జువా సోషలిజానికి - చేతి పరిశ్రమల యుగంలోకి పోవాలనడంలో ఫ్యూడల్ సోషలిజానికి-దగ్గరగా వుంటుంది.

గోపీచంద్‌గారు పట్టాభిగారు చెప్పుదానిలో సోషలిజం లేదని నిరూపించు చున్నపుడు తాము ఉపయోగించు పదాలను జాగ్రత్తగా వాడాల్సింది. 18 వ పేజీలో "కనుక యీ పద్ధతి సోషలిజాని కంటే ఫేసిజానికి దగ్గర్లోవుంది" అనీ, 30వ పేజీలో "దేశీయ సోషలిజం అంటే అంతర్జాతీయ ఫేసిజం" అనే నినాదం లేవగియ్యాలని వ్రాసారు. ఈ మాటలు వారు మొదటి పేజీలో వ్రాసినటుల "నేను సోషలిష్టునిఅని చెప్పుకోవటం, ప్రత్యర్థిని ఫేసిష్టని నిందించటం, ఫేషనైపోయింది నేడు" అనే అర్థంలోనే వాడిన మేం వేరు వ్రాయనక్కరలేదు. సూత్ర ప్రాయంగా మాత్రం శుద్ధ తప్పు.

గోపీచందు గారు అనేక చోట్ల మార్క్సిష్టులు కానివారియు(మాగ్డనాల్డు,వెల్సు,వగైరా) సోషలిజాన్ని, కాపిటలిజం తరువాత మానవ నాగరితాభివృద్ధిగానే అంగీకరించని వారి వ్రాతల నుండియు కొటేషన్లు (Quotation) యిచ్చారు ఎందుకనో? మార్క్సు, ఎంజెల్సు లెనిన్, ల పుస్తకాలలోని వాదనల చేతనే "పట్టాభి గారి సోషలిజం"లోని అవకతవకల నిరూపించిన బాగుండేది. వెక్కిరింతలు (Heckling) తగ్గించి 'శాస్త్రీయ సోషలిజం' వివిధ సమస్యల నెటుల పరిష్కరించేది, విపులంగా తెలియ జేసిన పాఠకులకు సోషలిజంపై వున్న కలగలుపు (Confused ideas) భావాలు పోయి, స్పష్టమైన దృక్పథం యేర్పడుటకు సాయపడేది.

—మ. చం.



# వంట జేసే ప్రతి వనితా రాజ్య మేల గల్గి యుండాలి!

—లెనిన్

## స్త్రీలు ఎలా బానిసలయారు? ఏ సమాజంలో స్త్రీలకు విముక్తి ఉంది?

శ్రీ చంద్ర రాజేశ్వరరావు.

"స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. విద్య నేర్చుకోవటానికి అవకాశాలు లేవు. ప్రపంచంలోని విచిత్ర వస్తువులనుచూచి ఆనందించటానికి వీలులేదు. భర్త అన్యాయంగా కొట్టి హింసిస్తే మాట్లాడటానికి వీల్లేదు. భర్త ఏమిచేసినా నోరు మూసుకు కూర్చోవాలిసిందే" అని ఏసోషలిస్టు యువకుడన్నా అంటే, "అసలు సృష్టిలోనే ఉంది. స్త్రీలు పురుషులకు లొంగి ఉండాలని. మనుష్యజాతి పుట్టినప్పటి నుంచి అలాగే జరుగుతూ వచ్చింది" అని అంటాడు మామూలుగా.

### ఆదిమ స్త్రీలు

ఫ్రెడరిక్ ఏంగెల్స్, లూయీ మోర్గన్ అను మహానుభావులు సమాజ పరిణామాన్ని గూర్చి పరిశోధన చేయక పూర్వం, పైభావాలే ప్రజల్లో వ్యాపించి ఉన్నాయి. మోర్గన్ అమెరికా దేశస్థుడు. ఆ దేశంలోని అనాగరక జాతి అయిన "రెడ్ ఇండియన్"లతో కలిసి జీవించి, వారి సామాజిక విధానాన్ని పరిశోధించి "పురాతన కాలంలోని సమాజం" (Ancient society) అనే గ్రంధాన్ని వ్రాశాడు. ఎంగెల్స్ ఇంకా పరిశోధించి, "కుటుంబము యొక్క పుట్టుక" (Origin of the family) అనే గ్రంధాన్ని వ్రాశాడు. వీరిద్దరి వల్లనే పురాతన సమాజంలో మనుష్య జీవితం ఎలా ఉండేది, స్త్రీలు ఏవిధంగా చూడబడేది మొదలైన విషయాలు తెలిసినాయి.

మానవ సమాజం మారుతూ అనేక రూపాలను బొందినది. మొట్టమొదట మనుష్యులు ముఠాలు ముఠాలుగా జీవించే వారు. వారికి ఇళ్ళు వాకిళ్ళు లేవు. వేటాడి జంతువులను చంపి వాటిని తిని జీవించేవారు. ఒకచోట జంతువులు అయిపోగానే మరొకచోటుకు వెళ్ళేవారు. స్త్రీలు పురుషులతో బాటు అప్పుడప్పుడు వేటలో పాల్గొనేవారు. పండ్లు, పుల్లలు పోగుచేసేవారు. పిల్లలను సమదాయించే వారు. ఈ సమాజంలో పెళ్ళిళ్ళు పేరంటాళ్ళు లేవు. ముఠాలోని స్త్రీ లందరూ పురుషులందరి భార్యలు. అంతా పని చేసేవారు. అంతా అనుభవించేవారు. స్త్రీ పురుషులు సమాన హక్కులు కలిగి ఉండేవారు. ఇప్పటికినీ ఆదిమ నివాసుల నాగరికతలో దగ్గరగా ఉన్న ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియాలోని అనాగరిక జాతులోని స్త్రీలు చాలా స్వాతంత్ర్యాన్ని అనుభవించు చున్నారు. ఎంగెల్సు అనాగరక జాతి స్త్రీలను గూర్చి ఈ క్రింది విధంగా చెప్పాడు. "మానవ సమాజారంభంలో స్త్రీ, పురుషునికి బానిసగా ఉండెనని అనుకొనటం, పదునెనిమిదవ శతాబ్దపు తెలివితక్కువ అభిప్రాయాలలో ఒకటి. అడవి మనుష్యుల స్త్రీలకు, (savages) అనాగరకుల (barbarians) స్త్రీలకు, స్వాతంత్ర్యముండుటేగాక, చాల ఎక్కువ గౌరవంగా చూడబడేవాళ్ళు. ఈ విధంగా స్త్రీలు స్వతంత్రాన్ని అనుభవించినట్లు గ్రీసులోని స్పార్టా, జర్మను జాతి చరిత్రలవల్ల గూడ రుజువు అవుతుంది."

### మొదటి దశ

క్రమ క్రమంగా మనుష్యులు వ్యవసాయం చేయటం తెలుసుకొన్నారు. ఆవు మొదలైన జంతువులను మచ్చిక చేసి వాని పాలు తీసి ఉపయోగించు కోవడం తెలుసుకొన్నారు. దీనితో ఇళ్ళు కట్టుకొని స్థిర నివాసాలు ఏర్పరచుకొనటం మొదలు పెట్టారు. నెమ్మది నెమ్మదిగా ముఠాలోని అందరు స్త్రీలు అందరి పురుషుల భార్యలుగా ఉండే ఆచారం పోయి, ఒక స్త్రీతో ఒక్క పురుషుడు ఉండే ఆచారం అమలులోకి వచ్చింది. ఈ రోజుల్లో గూడ స్త్రీ పురుషునితో బాటు సమాన స్వాతంత్రం అనుభవించేది. పురుషులతోబాటు ముఠా సభల్లో పాల్గొనేది. చర్చించేది. తీర్మానాలు చేసేది. ముఠా నాయకుడ్ని ఎన్నుకొనేది. తన భర్త మంచివాడు కాకపోయినా, హింసించినా వానిని వదలివేసి మరొకనిని భర్తగా స్వీకరించేది.

### స్త్రీల పెత్తనం

అంతేగాదు. పురాతన కాలంలో ఒకప్పుడు స్త్రీలు పెత్తనం జేశారంటే ఎవ్వరు నమ్మరు. కాని చరిత్ర ఆ విధంగా జెప్పుతుంది. ఈ సమాజాన్నే మాతృస్వామిక సమాజం అంటారు. అంటే తల్లి అధికారం చేసే సమాజం అని అర్థం. అందుచేతనే దానికి ఆ పేరు వచ్చింది. 'సెనెకా ఇరాకాయిస్' (seneca Iroquois) అనే రెడ్ ఇండియన్ తెగలో మత ప్రచారకుడగు ఆర్థర్ రైట్ ఆతెగ సామాజిక విధానాన్ని గూర్చి ఈ విధంగా వ్రాశాడు.

"పొడుగాటి ఇండ్లలో చాల కుటుంబాలు కలిసి ఒక్కొక్క ఇంట్లో నివసించే దశలో, ఒక తెగ ఈ క్రింది విధంగా పరిపాలింపబడేది. స్త్రీలు తమ భర్తలను ఇతర తెగలనుండి కోరుకునేవారు. కుటుంబాన్ని స్త్రీలు నడిపేవారు. జీవితావసరాలకు కావలసిన సామగ్రి అంతా సమిష్టి ఆస్థిగా ఉండేది. కష్టపడి పనిచేయని భర్త (ప్రియుడు) జీవితము దుర్భరంగా ఉండేది. వానికి ఎంతమంది పిల్లలున్నా, ఆస్తి ఎంత ఉన్నా ఏమీ లెక్కకు రావు. ఏ నిముషాన్నయినా మూటముల్లె కట్టుకొని పొమ్మనమన్నా పొమ్మనవచ్చు. వానికి అప్పుడు ఎదురు తిరగటానికి గుండె ఉండేది కాదు. పొమ్మనమన్న తరువాత ఇంటిలో ఉండటానికి అవకాశంలేదు. మరొక తెగలో మరొక భార్యను చేసుకోవడంగాని, తన తెగకు మరలిపోవటం తప్ప వేరే గత్యంతరం ఉండేదిగాదు. స్త్రీలు తెగలోను, తెగబయటా పెత్తనం చేసేవారు. అప్పుడప్పుడు తెగయొక్క పెద్దను తీసివేయుటానికి గాని, హోదాను తగ్గించడానికి గాని వెనుకంజ వేసేవారుగారు." స్త్రీలు అధికారాన్ని చలాయించటానికి కారణం తెగలోని పురుషులంతా ఇతర తెగలనుండి రావటమే. తెగలోని స్త్రీలంతా దగ్గర బంధువులుగా వుంటూరు. మగవాళ్ళంతా వేరేవేరే తెగలనుంఢి వస్తారు. పైగా పుట్టిన పిల్లలు తల్లిని నిర్ణయించటానికి అవకాశం ఉందిగాని, తండ్రిని నిర్ణయించడానికి అవకాశం చాల తక్కువ, అందువల్ల పిల్లలంతా తల్లి పక్షాన్నే ఉండేవాళ్ళు.

### రెండవ దశ

నాగలి, ఇనుముతో గొడ్డలి మొదలగు పనిముట్లు చేయుట కనిపెట్ట బడ్డది. దానిని, ఎడ్లు గుర్రాలతో లాగించడం కూడ మొదలు పెట్టారు. ఆవులు, మేకలు, గేదెలు మొదలైన పెంపుడు జంతువులను పెంచటం బాగా ఎక్కువైంది. వ్యవసాయం చేయటానికి, పశువులను పెంచటానికి చాలినంతమంది మనుష్యులు తెగలో లేకపోయినారు. దానిలో ఇదివరకువలె యుద్ధంలో ఓడిపోయిన ఇతర జాతుల (tribes) వారిని చంపటం మానివేసి. వార్ని బానిసలు చేయించటం ప్రారంభించారు. పంటలు మొదలైన తినుబండారల ఉత్పత్తి చాల ఎక్కువై పోయింది. మొట్టమొదట భూమీ పశువులు మొదలైనవి తెగయొక్క సాముదాయక ఆస్తిగా ఉండేవి. రానురాను పశువులు మందలు భూమి విభజింపబడి తెగలోని కుటుంబాల ఆస్తులయినాయి. దీనితో వ్యక్తిగత ఆస్తి (private property) ఆరంభమైనది.

### బానిసత్వ ప్రారంభం

స్త్రీ ఇంటిలో పనిచేస్తూ ఉండడం వల్ల, ఇంటిలో ఉపయోగించే పాత్రసామానంతా స్త్రీ ఆస్తిగాను, పురుషుడు వ్యవసాయం చేయటం, పశువులను మేపటం మొదలైన పనులు చేయటం వల్ల ఆ పనులు చేయటానికి ఉపయోగించే పనిముట్లు పురుషునివిగా ఉండటం అనాదినుండీ ఆచారంగా వస్తూంది. ఈ ఆచార ప్రకారమే పశువులు, భూమి విభజింప బడ్డ తరువాత పురుషుని ఆస్థిగా పరిగణింపబడేది. యుద్ధాలు చేసేది పురుషుడే గనుక బానిసలు గూడ పురుషుని ఆస్థియే. ఒకవేళ భార్యా భర్తలు వేరైపోతే ఎవరి ఆస్తిని వారు తీసుకొనేవారు. ఈ విధంగా పురుషుని ఆస్తి అనేకరెట్లు పెరిగిపోయింది. ఆస్థి పెంపకం ఎక్కువయ్యే కొందీ కుటుంబంలో భార్యకన్నా భర్త యొక్క ప్రాముఖ్యత ఎక్కువ అవుతూపోతూ వచ్చింది. అప్పటి కాలంలో ఆచారం ప్రకారం తల్లి ఆస్థి పిల్లలకు చెందేది. కాని తండ్రి ఆస్థి పిల్లలకు చెందదు. తండ్రి ఆస్థి అతని అక్క చెల్లెండ్ర పిల్లలకు చెందేది. ఈ ఆచారం ఇంకా ఇప్పటికీ దక్షిణాన మలబారులో అక్కడక్కడ ఉంది. సాధారణంగా తనయొక్క ఆస్థిని తన పిల్లలకే చెందేటట్లు చేయాల్సి ఉంటుంది. (ఆస్థి సముదాయకంగా ఉన్న రోజుల్లో ఉండేదికాదు) ఇందువల్ల సమాజంలో పూర్వపు ఆచారం పోయి తండ్రి ఆస్థి పిల్లలకు చెందే ఆచారం అమలులోనికి వచ్చింది. దీనితో స్త్రీలు చిరకాలం నుండి అనుభవించుచున్న స్వతంత్రాన్ని కోల్పోయ్యారు. ఇంటిలో గూడ పురుషుడు పెత్తనం చేయనారంభించాడు. స్త్రీలను బానిసలను చేసి పిల్లలను తయారు చేసే యంత్రంగా తయారు చేశారు. తన భర్త ఆస్థి తన పిల్లలకు సంక్రమించటాని కోసం, భర్త ఏమిజేసినా సహించాలిసి వచ్చేది. భర్త వ్యభిచారం చేసినా, ఇంకా కొంతమంది స్త్రీలను పెండ్లి చేసుకొన్నా భార్య సహించేది.

పైజెప్పిన నాటినన్నిటినీ ఆలోచిస్తే స్త్రీలు స్వతంత్రాన్ని కోల్పోవటానికి కారణం మొట్టమొదట తెగయొక్క మొత్తం ఆస్థిగా ఉన్న భూమి మగ్గాలు, నాగళ్ళు, పశువులు మొదలైన ఉత్పత్తి సాధనాలు తెగలోని పెత్తనం జేస్తున్న కుటుంబ యజమానుల ఆస్థిగా మారటం. అనగా సమాజము యొక్క ఆస్థిగా ఉన్న భూమి పశువులు మొదలైన ఉత్పత్తి సాధనాలు వ్యక్తుల ఆస్థిగా అవటమే.

### సోషలిజం: స్త్రీలు

స్త్రీలు పురుషులతోపాటు సమాన హక్కులనెపుడు పొందుతారు? ఈ ప్రశ్నకు సోషలిస్టులు సోషలిస్టు సమాజంలోనేనని జవాబు చెబుతారు. సోషలిస్టు ఉద్యమానికి పునాది వేసిన వారిలో నొకరగు ఎంగెల్సు ఈ విధంగా చెప్పాడు. "ఆర్థికంగా పురుషుడు స్త్రీ కన్నా ఎక్కువగా ఉండుట వలననే స్త్రీ మీద పురుషుడు పెత్తనం జేస్తున్నాడు. ఆస్థి పురుషుని చేతినుండి పోయిన వెంటనే ఈ పెత్తనంగూడ నశిస్తుంది" ఈ వాక్యంలో ఎంత సత్యం ఉందో గమనించండి. కూలీ స్త్రీలు ఎంత స్వతంత్రంగా ఉంటారో మనం ప్రతిరోజూ చూస్తూ ఉన్న విషయమే. వారు భర్తలు మంచివారు గాకపోయినా హింసించినా వదలివేసి మరొకరిని చేసుకుంటూరు. వాళ్ళకు ఏ శాసనం అడ్డురాదు. వాళ్ళకు ఏ ఘోషాపద్ధతీ లేదు. రైతుల మధ్య తరగతి స్త్రీలను బాధించే ఏ సాంఘిక దురాచారం లేదు. కారణం అందరకు తెలిసినదే. పురుషుల దగ్గర ఓటి కుండలు, ఉక్కిమంచాలు తప్ప మరే ఆస్థీ లేకపోవటమే. సోషలిస్టులు ఆస్థులన్నీ పోగొట్టుకొని కూలీ లవమంటారని దురభిప్రాయపడవచ్చు. సోషలిస్టులు దోపిడీ విధానాన్ని నాశనంచేసి, పురుషుల నుండి స్త్రీలను రక్షించి మానవులంతా సుఖముగా నుండే సోషలిస్టు సమాజాన్ని స్థాపిస్తామని చెప్పుతారు. అంతేగాని ఆస్థులను పోగొట్టుకొమ్మనరు. వ్యక్తిగత ఆస్థిని కాపాడే బూర్జువా సమాజం పురుషుని ఆస్థిని రద్దు చేయలేదు. కనుక బూర్జువా సమాజాన్ని రద్దుచేసి ఆస్థి నంతా సమాజ పరంజేసే సోషలిస్టు సమాజంలోనే స్త్రీలు పురుషులతో బాటు సమాన హక్కులను పొందుతారని రుజువౌతుంది.

### రష్యాలో

రష్యాలో సోషలిస్టు సమాజాన్ని స్థాపించటానికి దారిజూపిన లెనిన్ ఇలా అన్నాడు. "వంట చేతనైన వారందరికి, పరిపాలించుట

(మిగతా 18 వ పేజీలో)

## స్పానిష్ స్వాతంత్ర్య సమరం.

స్పానిష్ యుద్ధంలో ఈ వారం అంతగా చెప్పుకోదగ్గ విశేషాలు లేవు. ఎబ్రోనదీ తీరాన, టాగస్‌ప్రాంతాన విద్రోహుల దాడి తీవ్రతరంగా సాగుతూంది. 15 మైళ్ళ వెడల్పున విద్రోహులు ఎబ్రోనదీప్రాంతాన దాడిసాగించారు. విద్రోహులు కొంత జయించినా తీవ్రంగా నష్టపడ్డారని ప్రభుత్వమే ఒప్పుకుంది. ఒక టాగస్ యుద్ధ రంగంలో మాత్రం 250 మైళ్ళు విద్రోహులు వశపరచు కొన్నారని వార్త.

ఛాంబర్లేను

ఫ్రాంకో జవాబు ఆంగ్లో-ఇటలీ సంధికి అడ్డం వచ్చినా, జర్మనీ ఫ్రాంకోనే సమర్థిస్తున్నది. ఈ లోగా ఇటలీ సైనిక సహాయం, విమాన సహాయం పూర్తిగా ఫ్రాంకో పక్షానికి పోతూనే ఉంది. కాని ఫ్రెంచివారు మాత్రం ఈ బ్రిటన్‌ను నమ్ముకొని, 'పైరినీస్' సరిహద్దు మూసుక కూర్చున్నారు.

ఫ్రాంకో జవాబు బ్రిటన్‌లో అసంతృప్తి కల్గించిందే గాని, నిరాశ కల్గించలేదు. నాన్ ఇంటర్వెన్షన్ కమిటీ మీటింగు జరుగక పోయినా వ్యక్తిగతంగా లార్డ్ ప్లేమోత్, ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్ ప్రతినిధులతో సంప్రదించాడు. ఈ సంప్రదింపులు ఫలితం ఏమవుతుంటో తెలియదు. నేడు ఛాంబర్లేను రాజనీతి వలన, స్పెయిన్ సమస్యకూడా జకోస్లోవేకియా పరిస్థితుల బట్టి ఉండవలసి వచ్చేటట్లుంది. బ్రిటిష్ నౌకలకు రక్షణ లేకున్నా, బ్రిటిషు వారు చస్తున్నా, ఛాంబర్లేన్ ఇకిలించుతూనే ఉంటాడు. బ్రిటిష్ వారు చావడం అంటే జ్ఞాపకం వచ్చింది. ఈ మధ్యనే, అంటే ఆగష్టు 6 వ తేదీన డేవిడ్ గ్వెస్ట్ అనే 27 ఏండ్ల బ్రిటిషు యువకుడు ఎబ్రో యుద్ధ రంగంలో మరణించాడు. గ్వెస్ట్ తండ్రి పార్లమెంటు సభ్యుడు కూడాను. గ్వెస్ట్ కమ్యూనిష్టు. అతని చెల్లెలు కూడా రెండేండ్ల క్రిందట స్పెయిన్ పోయి, అప్పటి నుండీ, స్పెయిన్ ప్రభుత్వ సైన్యాలకు వైద్య సహాయం గావించు తున్నది. ఆమె హాస్పిటల్‌పై బాంబు పడింది. ఆ నాటి నుండి ఆమె వార్త రాలేదని తండ్రి విలపించు తున్నాడు. అదే వారంలో లూయీ క్లెయిన్ గూడా మరణించాడు. అతడు నార్త్ కెన్సింగ్టన్ పట్టణంలో సోషలిస్టు కౌన్సిలర్. బోటు షికార్ పందెములలో కూడ ప్రవీణుడు. అనేక పందేలలో బహుమతులను పొందాడు. గ్వెస్ట్ కేంబ్రిడ్జిలో గ్రాడ్యుయేట్ పదవి పుచ్చుకొన్నాడు. ఉపాధ్యాయ వృత్తిని వదలి రెండు నెలల క్రిందటే, ఇంటర్నేషనల్ బ్రిగేడ్‌లో చేరాడు.

ఇలాంటి మేధావులు, యువకులు స్పెయిన్ తరపున పోరాడి ఆహుతి అగు చున్నారు. కాని ఫేసిస్టు పక్ష పాతి ఛాంబర్లేనుకు చీమ కుట్టుట లేదు.

## హంగేరిలో నాజీ కుట్ర

హంగేరీలోని నాజీలు ఈ మధ్య అలజడి ప్రారంభించారు. ఈ అలజడికై 106 మందిని హంగేరీ ప్రభుత్వం అరెస్టు చేసింది. ఇదే సమయంలో హంగేరీ రీజంటు హోర్టీ జర్మనీలో హిట్లర్ సన్మానాలు పొందు తున్నాడు. ఈ సన్మానాలకు ఇక్కడి సంచలనానికి సంబంధం లేక పోలేదు. ప్రస్తుత పరిస్థితులను వివరించే ముందు, హంగేరీకి, నాజీ జర్మనీకి గల సంబంధాన్ని గురించి చెప్పాలిసి ఉంటుంది.

ఆస్ట్రియాను బలవంతంగా ఆక్రమించుకోడం తోనే హంగేరీ జర్మనీ పొరుగు దేశమయింది. ఈ ఆక్రమణ వలన హంగేరీకి కల్గిన నష్టాలివి.

1. ఆస్ట్రియాలో హంగేరీ వర్తకం నష్టపడింది. ఇది వరకు హంగేరీ వస్తువులు దిగుమతి అయేవి. ఆస్ట్రియాలో ఇపుడు జర్మనీ దిగుమతి హెచ్చింది.

(2) హంగేరీ వర్తకంలో కూడ జర్మనీ ప్రాబల్యం హెచ్చుతుంది.

(a) జర్మనీ, హంగేరీలోని వ్యావసాయక పదార్థాలను ఎగుమతి చేసికొని, పారిశ్రామిక వస్తువులను దిగుమతి చేయడానికిప్రయత్నిస్తుంది.

(b) ఇదివరకు మందులు ఎక్కువగా ఎగుమతి చేసేది హంగేరీ. కాని ఇపుడు జర్మనీతో పోటీ చేయలేదు.

(3) ఇదివరకు ఆస్ట్రియా నుండి కాజేసే ముడి పదార్థాలన్నీ హంగేరీ బదులు జర్మనీయే కాజేస్తుంది.


హిట్లర్

ఇన్ని నష్టాలే గాక హంగేరీ స్వాతంత్ర్యానికే హిట్లర్ ఎసరు పెడుతున్నాడు. ఒక్కొక్కసారి హంగేరీ నుపయోగించుకొని, జకోస్లోవేకియాను మ్రింగాలని, మరొకసారి హంగేరీని కూడా నాజీ మయం చేయాలని ప్రయత్నించుతున్నాడు. జక్-హంగేరీల మధ్య వైషమ్యం పెంచడానికి ప్రయత్నించడమే గాకుండా, నాజీలను విపరీతంగా పంపించాడు హంగేరీకి. గత సం॥రం జర్మన్ రాయబారి మెకెన్‌సన్ నాయకత్వాన ఒక దండయాత్రకు సంసిద్ధమైన విషయము అందరికీ తెలిసిందే. 5 వేల తుపాకులు, చేతి బాంబులు, చాలమంది ఫేసిస్టుల ధన సహాయం వారికి లభించింది. ఫెస్టీటిక్స్, రైనిచ్, మేజర్ జలాసీ అనేవారు ఫేసిస్టు నాయకులు. వీరంతా జర్మనీ కార్యక్రమాన్నే హంగేరీలో ప్రవేశ పెట్టాలని కోరేవారు. ట్రియనాన్ సంధిని (1920) భగ్నపరచి, యుద్ధానికి పూర్వం హంగేరిని కావించుతామని చెపుతారు. ఈ ఫేసిస్టుల ప్రభావం హంగేరీలో బాగానే పనిచేసింది.

# జకోస్లోవేకియా భవిష్యత్తు ఏమిటి?

## సెప్టెంబర్‌లో ప్రపంచ

స్పెయిన్ యుద్ధం—హంగేరీలో నాజీ కుట్ర—డాన్యూబ్ ఒడంబడిక—

1867 లో బానిసత్వం నశింపజేయ బడింది. అప్పుడు యూదులకు తదితరులతో పాటు సమాన హక్కులు లభించాయి. కాని క్రిందటి రెండు మూడు నెలల క్రిందట ఒక 'లా' ప్యాసయింది. దాని ప్రకారం యూదులు ఆయా వృత్తులలో నూటికి ఇంతమంది మాత్రమే వృత్తి చేయాలని ఒక నిబంధన ఏర్పడింది. దీనివల్ల యూదులు 1867 లో సంపాదించుకొన్న హక్కు కూడా నశించిపోయింది.

ఇంతేగాదు. ఇంకా కొన్ని ప్రజల హక్కులను లాగివేసే శాసనాలు ఏర్పడ్డాయి. రీజెంటు (రాజ ప్రతినిధి) అధికారాలు ఎక్కువ చేయబడినాయి. పైగా పై శాసన సభకు, ప్రతినిధుల సభ (క్రింది సభ) లోబడి ఉండాలి. మూడవది ఓటింగు హక్కు.

కార్మికుల ఓటింగు హక్కు చూద్దాం. 26 ఏండ్లు వచ్చిన కార్మికునకే ఓటింగు హక్కు. అతడు 10 ఏండ్లు హంగేరీలో ఉండి ఉండాలి. అందులో కనీసం 6 ఏండ్లు ఒకే మ్యునిసిపాలిటీలో ఉండాలి. ఆరవ ఫారం ప్యాసయి ఉండాలి. కుటుంబం ఉండాలి. చేతి వృత్తిగాని, వ్యవసాయ వృత్తిగాని, 6 సంవత్సరాలు వ్యవసాయ కూలీ లాగ గాని, లేక ఒక యజమాని క్రింద ఆరేండ్లు నౌకరుగా గాని ఉండి యుండాలి. ఇక స్త్రీల విషయం చూద్దాం. 30 ఏండ్లు వారికే ఓటు. కనీసం నల్గురు బిడ్డలను కని యుండాలి. అప్పుడే ఓటు ఉంటుంది.

ఆకలి బాధతో మండి పడే హంగేరీ ప్రజల నణచడానికి, ప్రజా స్వామిక హక్కులనీ విధంగా లాగి వేశారు. ఇది వరకు 36 లక్షలకు ఓటుండేది. ఈ క్రొత్త శాసనం వల్ల 21 లక్షల మందికే ఓటు.

దరాన్యీ మంత్రిత్వం పోయి, బెలా ఇమ్రెడీ మంత్రిత్వం వచ్చాక, ఫేసిస్టుల వైపుకు మరింత తల ఒగ్గింది హంగేరీ. ఇమ్రెడీ గావించిన ఉపన్యాసాలే అందుకు నిదర్శనం. అతడు ఇటాలియన్, జర్మనీ పద్ధతులపైని, పోలీసు నియంతృత్వం కావాలన్నాడు. కాని పూర్తిగా నాజీ మయం గావడానికి భయపడతాడు.

ఆస్ట్రియాను జర్మనీ ఆక్రమించక ముందు, హంగేరీ ఫాసిస్టు సంఘాలలో ఐక్యత ఉండేది కాదు. ఈమధ్యనే, అలగ్జాండర్ ఫెస్టీటిక్స్ తాను రాజకీయాల నుండి విరమించుకొని మేజర్ జలాసీ పక్షంలో తన అనుచరులను కలవమన్నాడు. మేజర్ జలాసీ "నేషనల్ విల్" అనే పార్టీకి నాయకుడు. ఫెస్టీటిక్స్ 'నేషనల్ సోషలిస్టు పార్టీ' నాయకుడు. వీరిద్దరి కలయికతో ఏ చిన్ని సంఘమో తప్ప ఫేసిస్టులందరూ ఏకమయ్యారు. మేజర్ జలాసీ చాలాసార్లు శిక్షించబడ్డాడు. ఈసారి 10 నెలల శిక్షకు గురి అయ్యాడు. అపీలులో 3 ఏండ్ల శిక్ష విధించబడింది. మళ్ళా సుప్రీమ్ కోర్టుకు అపీలు చేశాడు. కాని అది కూడా ఖాయపరచింది. అతనికి 5 సంవత్సరాల వరకు పౌరసత్వ హక్కు ఉండదు. బుడాపెస్టులోని, 10 లక్షలలో $4\frac{1}{2}$ లక్షలు తనవైపునే ఉన్నారని ఇతడు ప్రగల్భాలు కొట్టుకుంటాడు.

ప్రపంచ యుద్ధం తర్వాత కమ్యూనిస్టు విప్లవము వచ్చి, రైతాంగానికి కొంత ఆశగొల్పింది. కాని, విప్లవాన్ని నాశనం గావించారు. అలా గావించిన నాశనం వారిలో హోర్టీ ముఖ్యుడు. ఆకలి గొన్న ఈ రైతాంగాన్ని ఫేసిస్టులు తమ వైపుకు త్రిప్పుకోవాలని ప్రయత్నిస్తున్నారు.

## లిటిల్ ఎంటెంటీ—హంగేరీ సంధి.

ఇలాంటి సమయంలోనే హోర్టీ జర్మనీ వెళ్ళాడు. హిట్లర్ అఖండ స్వాగతం ఇచ్చాడు. ఈ సన్మానాల సందడిలోనే రెండు ఘటనలు జర్మనీ ఆశను తలక్రిందు చేయగల్గినాయి. ఒకటి బాల్కన్ ఎంటెంటీ, బల్గేరియాతో సంధి చేసికోవడం. బాల్కన్ ఎంటెంటీలో, జుగుస్లేవియా, రుమేనియా, గ్రీస్, టర్కీలున్నాయి. ఇవి బల్గేరియాతో నాన్ ఎగ్రిషన్ ప్యాక్టు (ఇత

## నేటి ప్రపంచం

పల మీద దాకడం మానడం) చేసికొన్నాయి. ఇదివరకు బల్గేరియాపై ఉన్న కఠిన షరతులు రద్దు అవుతాయి. బల్గేరియా ఇక ఆయుధాలను పెంపొందించుకో వచ్చు. ఆర్థికంగా ఇదివరకు బల్గేరియా హిట్లర్ చేతులలో ఉంది. ఈ సంధి వల్ల అధికాస్త్రా ఊడుతుంది. ఈ బాల్కన్ ఒడంబడిక మరో సంధికి దారితీసింది. లిటిల్ ఎంటెంటీ (రుమేనియా, జుగొస్లేవియా, జకోస్లోవేకియా) హంగేరీతో నాన్ ఎగ్రిషన్ ప్యాక్టు గావించుకొంది.

దీనివల్ల జకోస్లోవేకియాకు ఆగ్నేయ భాగం నుండి దెబ్బ వస్తుందనే భయం పోయింది, పై రెండు ఒడంబడికలు వల్ల డాన్యూబ్, బాల్కన్ రాష్ట్రాలలో హిట్లర్ పలుకుబడి తగ్గుతుంది. కాని, లిటిల్ ఎంటెంటీకి హంగేరీకీ గల సమస్యలన్నీ పూర్తిగా లేదు.

హంగేరీ, ట్రియనాన్ సంధి వల్ల చాలా నష్ట పడింది. ప్రపంచ యుద్ధం తర్వాత, తన 9 లక్షల ప్రజలలో, 3 లక్షల ప్రజలు విడిపోయారు. వారిని అంటే వారున్న ప్రదేశాలను తిరిగి పొందాలని హంగేరీ ఆశ. అందుకోసమే ఇటలీతో ఇమ్రేడీ రాయబారాలు జరిపాడు. హంగేరితో రుమేనియా జిల్లాలు ఉన్నాయి. రుమేనియాయే ఇన్నాళ్ళనుండి అడ్డు వస్తున్నది హంగేరీ కోర్కెలకు. బహుశా ఇపుడు



## యుద్ధం తప్పదా?

జకోస్లోవేకియా భవిష్యత్తు—చైనా జపాను యుద్ధం.

హంగేరీ పూర్వపు ప్రదేశాలకు బదులు హంగేరీకి, రుమేనియా తన జిల్లాలు ఇవ్వ వచ్చు. కాని హిట్లర్ ఒక ప్రకటన గావించాడు. తాను హంగేరీ జోలికి రానని. కాని అతడు అడిగేది ఏమిటంటే, 1920 ట్రియానన్ సంధి వల్ల జర్మనీలో కలసిన బర్గెను లాండును మాత్రం తిరిగి అడగకూడదు అని.

రుమేనియా, ఈ సంధి కావించు కోడం సాహసమే అనాలి. రుమేనియా పరిస్థితి చాల కష్టమైనది. రుమేనియా ఏవైపుకు మ్రొగ్గటమా అని ఊగులాడుతూ ఉండేది. ఈ రెండేళ్ళ చరిత్ర తీసికోండి.

రుమేనియాకు మొదటినుండి రష్యా అంటే ఒక భయం ఏర్పడింది. దానికి కారణం జారు ప్రభుత్వం. జారు ప్రభువులు అనేక చిక్కులు కల్పిస్తూ ఉండేవారు. ప్రపంచ యుద్ధం తర్వాత ప్రజా సామాన్యంలో బోల్షివిక్ ప్రచారము హెచ్చింది. బెస్సార్బియాలోని రష్యనులుకూడా తమ మాతృదేశంపట్ల అభిమానంతో ఆందోళన గావించారు. అపుడు బెస్సార్బియా విషయమై టిట్యూలెస్కు రష్యాతో సంధికి వచ్చాడు. అతడు రష్యతో పూర్తి సహకార బుద్ధిని చూపించాడు.

జకోస్లోవేకియాకు ఆపద వచ్చినపుడు, రుమేనియా గుండా రష్యా సైన్యాలను గూడా పోనీయడానికి అతడు సంసిద్ధుడయ్యాడు. కాని

ఇతని రాజనీతి రుమేనియాలో అలజడి గల్గించింది. అతనిని పదవినుండి తొలగించారు. తర్వాత వచ్చిన పరిపాలకులు పోలండుతో సంధి జేసుకొని తటస్థంగా ఉండదలచారు. కాని రష్యా, జకోస్లోవేకియా సహాయార్థం తమ దేశంగుండా రాకమానదని, భయం కల్గింది. ఇంతలో గోగా ప్రభుత్వం వచ్చింది. అతడు పూర్తిగా ఫేసిస్టు పక్షం వహించాడు. ఇతడు హంగేరీ, జర్మనీలతో ఒక సంధి గావించదలచుకొన్నాడు. ఆ సంధి ప్రకారం, జర్మనీ సైన్యాలు, హంగేరీగుండా వచ్చి, బెస్సార్బియా (రష్యా సరిహద్దులో ఉంది) లోనుండి రష్యాను దెబ్బగొట్టాలి. కాని ఈ సంధి జరక్కముందే గోగా ప్రభుత్వం రద్దు అయింది.

ప్రస్తుత పరిస్థితులలో రుమేనియా ఏదో ఒక పక్షం వహించాలి. మధ్య యూరప్‌లో తటస్థత అనే పేరేగాని, శాంతినిగోరే రష్యా పక్షం అయినా చేరాలి, లేదా దాడిసల్పే జర్మనీ పక్షం అయినా చేరాలి. ఇది తప్పదు. జకోస్లోవేకియాలోని జర్మను ఆందోళనకు రుమేనియా తాను తావిస్తే తన దేశంలో ఉన్న జర్మన్, హంగేరియన్ మైనారిటీల సమస్య ఎదుర్కోవలసి వస్తుంది. అందుకని హంగేరితో ఒడంబడిక చేసుకొంటే ఆ సమస్య తీరిపోతుంది. పైగా జకోస్లోవేకియా పక్షం వహించడంవల్ల మరో లాభం ఉంది. రేపు హిట్లర్ దాడి ఎత్తితే, హంగేరీ యుద్ధ క్షేత్రం అవుతుంది. రష్యాతో సంధి చేసుకుంటే తమపని పూర్తికాగానే రష్యా వెనక్కి మరలి పోయే అవకాశమున్నది. కాని హిట్లర్ అయితేనో? పీఠం వేసుక కూర్చుంటాడు. ఇదీ రుమేనియా హంగేరీతో సంధికి ఒడంబడటానికి కారణం. రష్యా జర్మనీ సంఘర్షణ కొద్ది ఘటనలతో సమాప్తి చెందదని తెలుసు. అయినా ఆశ. కొంత గుడ్డిలో మెల్ల. అందుకనే ఈ సంధికి రుమేనియా సంసిద్ధపడింది.

## జకోస్లోవేకియా భవిష్యత్తు.

జకోస్లోవేకియా సమస్య రోజు రోజు తీవ్రమౌతున్నది. రన్సిమన్ ప్రభువు సంప్రదింపులు జరుపుతూనే ఉన్నాడు. రన్సిమన్ నిష్పక్షపాతి అని తాను చెప్పుకున్నా, అతడు నాజీ పక్షపాతియే. బ్రిటిష్‌వారు రన్సిమన్‌ను పంపింది జకోస్లోవేకియా మెడ వంచడానికే. రన్సిమన్ చరిత్రయే, అతడు నాజీ పక్షం వహించక తప్పదని తెల్పుతుంది.

రన్సిమన్ లండన్‌లో గొప్ప ధనాఢ్యుడు. బాంకింగ్, రైల్వే, షిప్పింగ్ శాఖలన్నిటిలోనూ ఇతనికి సంబంధం ఉంది. 1936 లండన్‌లోని గని పనివాండ్ర సమ్మెను నాశనం చేయడంలో సహాయపడ్డాడు. ఇతడు కూడా నాజీ పక్షపాతులలో ఒకడు.

రన్సిమన్ జక్కు పోయి చేసిందేమిటి? జర్మనీ హక్కులకై, జకోస్లోవేకియా తల వంచేటట్లు చేయాలని ప్రయత్నిస్తున్నాడు. సూడెటన్ జర్మనులకు రాష్ట్రాలు ఏర్పరచి, వారికి అటానమీ ఇప్పించాల ఇతని ప్రయత్నం దీని అర్థం ఏమిటి? జకోస్లోవేకియా తన గోయి తాను త్రవ్వుకోడమే. ఇపుడు రన్సిమన్ సలహా ప్రకారం 3 జర్మను రాష్ట్రాలు ఏర్పరచితే, జక్‌లో నాజీ ప్రచారం విరివిగా సాగుతుంది. చివరకు అంతర్యుద్ధమూ, ఆస్ట్రియాను మ్రింగినట్లు నాజీలు దిగమ్రింగటం జరుగుతుంది. బ్రిటన్‌కు జకోస్లోవేకియాను నెమ్మదిగా హిట్లర్ మయం చేయడం ఇష్టమే. కాని ఈనాడే తనసమ్మతి చూపించరాదు. యుద్ధం చేస్తే, తానూ పాల్గొనాలి. ఫ్రాన్సు సహకారం పోగొట్టుకోరాదు. అందుకనే ఈవక్రమార్గాన్ని బ్రిటిష్ రాజకీయవేత్తలు అవలంబించుతున్నారు.

జక్ ప్రధాని హోడ్జా పార్లమెంటు కమిటిని కలిసికొన్నాడు. దానిలో జకోస్లోవేకియాను ఈవిధంగా విభజించాలని సూచించాడు. (1) సూడెటన్ జర్మనీ (2) జక్ (3) స్లోవక్ (4) హంగేరీ ప్రదేశాలు. కాని ఈ సూచనను పార్లమెంటు సబ్‌కమిటీ ఎదుర్కొన్నది. ఈ విధంగా విభజించి, ముఖ్య అధికారాలన్నీ కేంద్ర ప్రభుత్వంలో ఉంచుకోవచ్చునని హోడ్జా అభిప్రాయం. కాని దీనివల్ల ఎక్కడలేని ప్రాముఖ్యత జర్మనులకిచ్చి వారి ఉద్యమాన్ని వృద్ధి చేయడమన్న మాట!

ఎప్పటి కప్పుడు ఈ సంప్రదింపుల వార్తలు బ్రిటన్ తెలుసుకొంటున్నది. రన్సిమన్ ముఠాలో ఒకరగు ఆష్టన్-గ్వాట్కిన్ ఛేంబర్లేనుకు జక్‌లో జరిగిన దంతా రిపోర్టు చేశాడు. జర్మనీలోని బ్రిటిష్ రాయబారిని ఇంగ్లండు పిలిపించాడు. జాన్ సైమన్, చర్చిల్‌గార్లు జకోస్లోవేకియాపై స్టేటుమెంటుల నిచ్చారు. చర్చిల్ యుద్ధం ఇపుడపుడే రాకపోయే ఆశ ఉన్నా, ఆస్ట్రియా నాటకం ఆడబడ వచ్చునని భయపడ్డాడు.

సైమన్ భాషణం పాము చావకుండా, కర్ర విరగకుండా ఉన్నది. ఒక ప్రక్క జర్మనీని మరొప్రక్క జకోస్లోవేకియాను బెదరించినట్లు ఉంది. దీనికి జర్మనీలో తీవ్రమైన అసంతృప్తిని వెలిబుచ్చాయి పత్రికలు.

నేడు వీనస్, హెన్లిన్‌ల సంభాషణలు ప్రారంభమయాయి. ఈ సంభాషణలు ఫలిస్తాయా? జక్ భవిష్యత్తు ఏమిటి? ఈ ప్రశ్నలు మనలను ఎదుర్కొంటున్నాయి. హిట్లర్, ఒక ప్రక్క బ్రిటనుపై ఒత్తిడితెచ్చి జకోస్లోవేకియాలో తన ప్రాబల్యం హెచ్చు గావించాలని చూస్తున్నాడు. తన సైనిక ప్రదర్శనాలతో అట్టహాసం గావించు తున్నాడు. వేలకొలది కార్మికులను సరిహద్దులలో పని చేయించుతున్నాడు. ఈ ప్రదర్శనాలు, అట్టహాసాలు ఊరకనేనా? కాదు, ఒకవేళ బ్రిటిష్‌వారి రాయబారం సఫలం కాకపోతే దండెత్తడానికే.

సైమన్ భాషణను బట్టి హిట్లర్ నిరుత్సాహ పడాల్సిందే. కాని క్రిందటిసారి వలె (మే లో) బ్రిటన్ బెదరింపుకు ఈసారి కూడా లొంగుతాడా? లొంగకూడదు. కారణం తన దేశంలో విపరీత పరిస్థితు లేర్పడుతున్నాయి. ప్రజలలో భీతావహం హెచ్చింది. ఆర్థిక దుస్థితి హెచ్చింది. రహస్య సంఘాల వ్యతిరేక ప్రచా


ప్రధాని హోడ్జా

రం ఎక్కువయింది. ఈ అశాంతిని ఎదుర్కోవాలన్నా, జర్మనీ యుద్ధం చేయాలి. దానికి, జకోస్లోవేకియా కన్న మరో రంగం లేదు. కాబట్టి న్యూరెంబర్గు సమావేశం అయాక, సెప్టెంబరులో హిట్లర్ ఏదో చేయక తప్పదు. అందుచేతనే బ్రిటన్ కూడా హడావిడి పడుతున్నది. బ్రిటన్ జకోస్లోవేకియాను, సూడెటను జర్మనుల కోర్కెలకు లొంగమంటుంది. లొంగకపోతే, తాను ఫ్రాంసుతో చేసికొన్న ఒడంబడికను భగ్నం కావించి, దూరంగా కూర్చుంటానని తెల్పుతుంది. అంతటితో ఫ్రాంసు బలహీనపడుతుంది. హిట్లర్ దెబ్బ కొడతాడు.

## హిట్లర్ దండెత్తితే

ఒకవేళ సంప్రదింపులే భగ్నమయి, హిట్లర్ దండెత్తితే ఏం జరుగుతుంది. రష్యా, ఫ్రాంసులు తలపడతాయి కాని దానితోనే అది ప్రపంచ యుద్ధం అని అనరాదు. జకోస్లోవేకియా తన మాట వినలేదని బ్రిటన్ తాటస్థ్యం వహించుతుంది. ఇటలీ కూడా వెంటనే ఉరకదు. ఏదో విధంగా స్పెయిను హతమార్చితే దాలని తలుస్తుంది. అందుకు బ్రిటన్‌పై ఒత్తిడి గావించుతుంది. బ్రిటన్ తాను జక్‌కు సహాయం గావించడానికి, ఫ్రాంసును ఒక షరతు కోరుతుంది. అది స్పెయిన్ యెడల లోలోపల అపకారం చేయడం. అంటే బ్రిటన్‌కు అనుకూలంగా స్పెయిన్ వ్యవహారాలలో మెలగటం. దానిని బట్టి జకోస్లోవేకియాను రక్షించాలన్నా, స్పెయిన్‌కు అపకారం ఫ్రాన్సు చేయాలిసి ఉంటుంది. బ్రిటన్ మీద ఆధారపడే ఇలాంటి కుటిల నీతిని ప్రదర్శించకుండా, దలదీర్ (ఫ్రెంచి) ప్రభుత్వంమీద ప్రజా సామాన్యం ఒత్తిడి తేవాలి. నేడు 40 గంటల కోసరం పోరాడే, కార్మికులు ఈ విషయమై కూడ ఒత్తిడి చేసి, ఫ్రాంసు స్వయంగా, బ్రిటన్ వదలిపోయినా, తాను రక్షించుకొనేటట్లు, స్పెయిన్ జకోస్లోవేకియాలను రక్షించేటట్లు, ఫ్రాంసు రష్యాల మైత్రి ఉండేటట్లు చూడాలి.

జంగ్—కై—షేక్

## జపాను అమానుష చర్యలు.

హాంకో వైపుకు దాడికి తీవ్ర ప్రయత్నాలు జపాను జరుపుతున్నది, కియూకియాంగ్ వద్ద చైనా జపానుల కిపుడు సంఘర్షణ జరుగుతున్నది. సీన్‌షిన్ వద్ద జపాను తీవ్రంగా నష్టపడింది జూయీచంగ్‌ను పట్టుకొన్నామని జపాను ప్రకటించింది. కాని, చైనా అది అబద్ధమని తెల్పుతుంది. హాంకో ముట్టడి తీవ్రతరం చేయడానికి, జపాను మిలిటరీ హెడ్ క్వార్టర్సు, షాంఘే నుండి నాంకింగుకు, మార్చారు.

ఒక అమెరికా విమానం మీద-దానిలో డాక్టర్ సన్‌యట్‌సేను తనయుడు సన్‌ఫో ఉన్నాడనుకొని — తరిమారు జపానువారు. క్రిందకు దిగినా కూడా మర తుపాకులతో కాల్చి చిత్రవధ గావించారు. 17 గురిలో 12 గురు మరణించారు. పైగా ఈ వార్తలు కప్పి పుచ్చడానికి ప్రయత్నించింది జపాన్. తనచర్యల సమర్థించుకొన్నది. దీనికి అమెరికా తీవ్ర అసమ్మతి తెల్పింది. చైనా పక్షపాత బుద్ధి మానితే గాని ఇతర దేశాలకు జపాను హామీ ఇవ్వనని ఒక ప్రకటన గావించింది జపాను విషవాయువులను ప్రయోగించుటలో వెనుదీయుటలేదు. ఈ ప్రయోగంవల్ల ఒక చైనా దళంలో 22 వ తేదీన ఒక కమాండర్ మరి ఇద్దరూ తప్ప అందరూ మరణించారని లండనుకు చైనా రాయబారి అసమ్మతి తెల్పాడు.

ఈమధ్యనే 8 వ రూట్ ఆర్మీ (కమ్యూనిష్టు సైన్యం) ప్రథమ వార్షికోత్సవం జరిగింది, గోరిల్లా యుద్ధాలలో ప్రపీణుడగు చూ-తే తాము 600 పోరాటాలలో పాల్గొన్నామనీ 34 వేల జపాను వారిని చంపామనీ, 2 వేల మందిని ఖైదీలను చేశామనీ తెల్పాడు.

చైనా హఠాత్తుగా విజృంభించి జయించినదన్న చైనావార్తలను జపాను అబద్ధమంటున్నది. కాని నేటి వార్తలు కూడ చైనా విజయాన్ని తెల్పుచున్నాయి.

# దేవదాసు

## శరత్ బాబు

విరచితం

## పూర్వ కథ

నారాయణ ముఖర్జీగారి అబ్బాయి దేవదాసు, బడిపెద్దను "భోలా"ను సున్నపు గుట్టలో పడవేసి పారిపోయాడు. నౌకరు ధర్మదాసు అతని కోసం వెదుకుతూంటే నీలకంఠ చక్రవర్తిగారి అమ్మాయి పార్వతి దేవదాసును తాను తీసుకవస్తానని, నౌకరుతో చెప్పింది.

వెదురుగుమ్మెలో పొగ త్రాగుతున్న దేవదాసుకు పార్వతి తెచ్చిన తినుబండారాలు చాలక నీళ్ళయినా తెమ్మన్నాడు. ఈలోగా పారిపోతాడేమోనని పార్వతి తేలేదు. దేవదాసు కొట్టాడు. పార్వతి దేవదాసు పొగ త్రాగుతున్నాడని నారాయణగారితో చెప్పింది.

మరునటి దినం మళ్ళా పార్వతీ దేవదాసులు కలిసి ఆటలాడుతుండగా దేవదాసు చెట్టుమీద నుంచి పడటానికి పార్వతి కారణమయింది. దేవదాసు పార్వతిని కొట్టాడు.

పార్వతి, ఇంటికి వెళ్ళి పంతులుగారు కొట్టారని చెప్పింది. పార్వతిని బళ్ళోకి పంపకుండా నిశ్చయించారు. తనమీద చాడీలు చెప్పకుండా ఉన్న పార్వతి అంటే దేవదాసుకు మహా ఆనందమయింది.

బడిమాని రోజు ఆటపాటలతో పార్వతీ దేవదాసులు కాలం బుచ్చేవారు.

దేవదాసు ప్రక్క గ్రామానికి పోయాడు. పార్వతికి ఏమీ తోచక స్నేహితురాలు మనోరమ ఇంటికి వెళ్ళింది. కాని ఆమె బడిలోకి వెళ్ళింది. ఇంటికి వచ్చే త్రోవలో కనపడ్డ వైష్ణవు స్త్రీల చేత పాటలు పాడించి దేవదాసు ఇచ్చిన మూడు రూపాయలూ ముగ్గురకు ఇచ్చింది. అంతకు తక్కువ ఇస్తే 'మణుగు లెక్కలురాని' వైష్ణవ స్త్రీలకు భాగాలు కుదరవని పార్వతి అభిప్రాయం.

మరునాడు దేవదాసు గాలిపటానికి డబ్బు కావలసివచ్చి పార్వతిని అడిగాడు. పార్వతి కొడతాడని భయపడింది. కాని తాను "వైష్ణవులకు లెక్కలు కుదరవని ముగ్గురకూ 3 రూపాయలిచ్చాను." అని చెప్పిన సమాధానం దేవదాసుకు నచ్చింది. కొట్టలేదు. ఇద్దరూ, కోమటింటికి గాలిపటం కొంటానికి బయలుదేరారు.

ఆ తరువాత

### ४

ఈ విధంగా ఒక సంవత్సరం గడిచింది. పైన గడపటం కష్టమైంది. దేవదాసు తల్లి పోరు ఎక్కువైంది. "చూడండి. దేవా ఊరక గాలికి తిరిగి పాడవుతున్నాడు. వాడిని యిక చదివించడం లేదా? అని భర్తను అడిగింది.

వారు కొంచెం ఆలోచించి—"దేవాను కలకత్తా పంపుతాను. నగేనుని ఇంట్లో ఉండి చదువు కుంటాడు." అన్నాడు. నగేనుడు దేవదాసుకు మేనమామ అవుతాడు.

ఈ సంగతి అందరికీ తెలిసింది. పార్వతి విని చాల భయ పడింది. దేవదాసు ఒంటరిగా కనపడగానే అతని చేతులు పట్టుకొని ఊగులాడుతూ 'నువ్వు కలకత్తా పోతావా, దేవదా?' అని అడిగింది.

"ఎవరన్నారు?"

"పెద బాబు చెప్పాడు."

"ఛా—నేను పోను."

"మరి నిన్ను బలవంతంగా పంపితేనో?"

"బలవంతంగానా?"

దేవదాసు ఈ మాట అనే టప్పుడు పెట్టిన ముఖ భంగిమ చూసి, ఈ ప్రపంచంలో ఎవ్వరూ అతని చేత బలవంతాన ఏ పనీ చేయించలేరని పార్వతి స్పష్టంగా గ్రహించింది. పార్వతికి కూడా కావలసింది ఇదే. అందు చేత, మహా ఆనందంతో ఇంకో మాటు ఆతని చేతులు పట్టుకొని ఊగులాడుతూ, ముఖంవంక చూసి—"చూడు దేవదా! ఒక వేళ పోతావేమో!" అన్నది.

"ఎప్పటికీ పోను."

కాని ఈ ప్రతిజ్ఞ నిలువలేదు. తండ్రి అతన్ని తిట్టీ, భయపెట్టీ, ఆఖరికి కొట్టీ—ధర్మదాసును తోడిచ్చి కలకత్తా పంపించాడు. వెళ్ళే రోజున దేవదాసు మనస్సు చాల దుఃఖించింది. కొత్త చోటుకు పోతున్నాననే ఆనందంకానీ, కుతూహలంకానీ అతని కేమాత్రం కలగలేదు. దేవదాసును వదలి పెట్టడం పార్వతికి ఎంత మాత్రం ఇష్టంలేదు. ఏడ్చింది; గోల చేసింది; కాని ఆ పిల్ల మాట ఎవరు వింటారు? మొదట అభిమానం చేత దేవదాసుతో మాట్లాడనే లేదు. కాని చివరకు, దేవదాసు పిలిచి—"పారూ! మళ్ళీ నేను త్వరలో వస్తాను. పంపక పోతే పారిపోయైనా వస్తాను." అని ధైర్యం చెప్పినప్పుడు, పార్వతి అలకమాని, తన హృదయం విప్పి అనేక సంగతులు చెప్పింది.

పిమ్మట దేవదాసు, తల్లి ఆశీర్వాదంతో పాటు ఆఖరి కన్నీటి చుక్క కూడా శిరస్సున ధరించి, సూటుకేసు చేత పట్టుకుని గుర్రపు బండి ఎక్కి వెళ్లి పోయాడు. పార్వతికి అప్పుడు చాలా వేదన కలిగింది. కళ్ళ వెంట ఎంతో నీరు కార్చింది. అభిమానంతో ఆమె హృదయం బ్రద్దలయి పోయింది. మొదట కొంత కాలం పార్వతి ఇలా గడిపింది.

తర్వాత ఒక నాటి ఉదయాన లేచి చూచే సరికి, ఆమెకు చేసే పనులేవీ కనుపించ లేదు. ఇంతకు పూర్వం బడి మానేసి నప్పటినుంచి, ఉదయం నుంచీ సాయం కాలం వరకు, ఉత్త అల్లరీ ఆగంతోనే సరి పోయేది. అప్పుడు చేయాల్సిన పనులు చాల ఉండేవి – సమయం చాలేది కాదు. ఇప్పుడు సమయం చాల ఉన్నది – కాని ఎంత వెతకినా, చేసే పని కనిపించలేదు. ఒక రోజున, ఉదయం లేవగానే ఉత్తరం రాయటానికి కూర్చునేది. పది గంట లయ్యేది. తల్లి విసుక్కుంటూ ఉండటం చూసి— "అయ్యో, దాన్ని రాసుకోనియ్యవే, పొద్దుట పూట ఊరిమీద తిరిగే కంటే రాసుకోవటం మంచిది కాదూ?" అని నాయనమ్మ సమర్థించేది. యిక దేవదాసు దగ్గర నుంచి ఉత్తరం వచ్చిన రోజున పార్వతికి పండగ. గదిలో కూర్చుని ఆ రోజల్లా ఉత్తరం చదివేది.

ఇలా రెండు మాసాలు గడిచాయి. ఉత్తరాలు రాయటం, రావటం కూడా క్రమంగా మందగించాయి. ఉత్సాహం కొంత తగ్గి పోయింది.

ఒక నాటి ఉదయం పార్వతి—"అమ్మా, నేను మళ్లీ బళ్లోకి పోతానే!" అని తల్లిని అడిగింది.

"అలాగే పో తల్లీ! నిన్ను నేను బళ్లోకి ఎప్పుడు పోవద్దన్నాను?" అన్నది తల్లి.

ఆరోజున మధ్యాహ్నం, చాలా రోజుల క్రిందట పారవేసిన పలకా పుస్తకాలు బయటకు తీసి, దాసీ చేయి పట్టుకొని, మళ్లీ వెనకటి చోటుకే పోయి శాంతంగానూ ధైర్యంగానూ కూర్చున్నది.

"పంతులుగారూ! మా పారూను కొట్టా గిట్టా బోకండి. దాని ఇష్టంతో బళ్లోకి వచ్చింది. ఇష్టమైతే చదువుకుంటుంది. లేక పోతే ఇంటి కొస్తుంది." అన్నది దాసీ పంతులుగారితో.

"తథాస్తు!" అని పంతులు లోపల అనుకుని, పైకి—"అలాగేలే." అన్నాడు. పార్వతిని కూడా కలకత్తా ఎందుకు పంపలేదని ఒక మాట అడగాలనుకున్నాడు. కాని తన ఉద్దేశాన్ని బయట పెట్టలేక పోయాడు.

భోలా ఆ వెనకటి బెంచి మీదనే కూర్చుని ఉన్నాడు. ఆతన్ని చూడగానే పార్వతికి నవ్వు వచ్చే పర్యంతమైంది; కాని మరుక్షణానే ఆమె కళ్లలో నీరు తిరిగింది. తర్వాత భోలా మీద చాలా కోపంకూడా వచ్చింది. దేవదాసు ఇల్లు వదలి పెట్టటానికి కారకుడు వీడేనని ఆమె అనుకున్నది.

ఇలా కొన్ని మాసాలు గడిచాయి.

కొంత కాలానికి దేవదాసు తిరిగి ఇంటికి వచ్చాడు. రావటమే తడవుగా పార్వతి దగ్గరకు పరుగెత్తు కొచ్చాడు. అనేక సంగతులు మాట్లాడుకున్నారు. పార్వతికి, చెప్పవలసింది ఎక్కువేమీ లేదు; ఉన్నా చెప్పలేక పోయింది. దేవదాసు అనేక సంగతులు చెప్పాడు—అన్నీ కలకత్తావే. కొన్నాళ్ళకు ఎండాకాలపు శెలవులు కూడా అయిపోయాయి. దేవదాసు మళ్ళీ కలకత్తా వెళ్ళిపోయాడు. పార్వతి ఈమాటు కూడా ఏడ్చింది. కాని మునుపు టంత గంభీరత లేదు.

ఈ విధంగా నాలుగు సంవత్సరాలు గడిచాయి.

ఈ నాలుగు సంవత్సరాల్లో దేవదాసు స్వభావం చాలా మారిపోవటం చూసి పార్వతి చాటున అనేకసార్లు కళ్ళు తుడుచుకున్నది. ఇంతకు పూర్వం దేవదాసులో ఉండే గ్రామ్య దోష మంతా పట్టణ వాసంతో తుడుచుకు పోయింది. పాలిష్ చేసిన బూట్లూ, మంచి చొక్కాలూ, సన్నని ధోవతులూ, చేతి కర్రా, బంగారపు గడియారం గొలుసూ—వీటిలో ఏవి లేకపోయినా అతను బయటికి రావటానికి సిగ్గుపడే వాడు. ఇప్పుడు నదిఒడ్డుకు షికారు పోవటం అతనికి ఇష్టం లేదు—తుపాకి తీసుకొని వేటకు పోవటంలోనే అతనికి ఆనందము. చిన్ని చిన్ని పక్కె చేపలకు బదులు పెద్ద పెద్ద వాలుగలు పట్టాలని ప్రయత్నించే వాడు. ఇంతటితో ఆగినా ఫరవా లేదు. సాంఘిక—రాజకీయాలూ, క్రికెట్ ఫుట్ బాల్ మొదలగు వాటిని గురించీ చర్చిస్తూ ఉండేవాడు. అయ్యో! ఎక్కడ పార్వతి, ఇం కెక్కడి లాల్‌సానా పుర గ్రామం? బాల్యస్మృతిలో చిక్కుకొని పోకుండా ఉన్న ఒకటి రెండు ఆనంద దాయక విషయాలు అతకి జ్ఞాపకం లేదనటానికి వీల్లేదు. కాని, వివిధ విషయాలమీద ఉన్న ఉత్సాహంలో అవి అతని హృదయంలో ఎక్కువ సేపు నిలిచేవి కావు.

మళ్ళీ సెలవలు పూర్తి కావచ్చినవి. క్రిందటి సంవత్సరం ఇతను రాలేదు. మిత్రులతో కలిసి దేశాటనానికి వెళ్ళాడు. ఈమాటు తల్లి దండ్రులు ఘట్టిగా రమ్మని ఉత్తరం వ్రాశారు. అందుచేత ఇష్టం లేక పోయినా బెడ్ చుట్టి స్వగ్రామం రావటానికి హౌరా స్టేషను చేరుకున్నాడు.

ఇంటికి వచ్చిన రోజున ఆతని ఒంట్లో బాగుండలేదు. అంచేత ఆవాళ బయటకు రాలేక పోయాడు. మర్నాడు పార్వతి ఇంటికి వచ్చి— 'అత్తయ్యా!' అని పిలిచాడు.

'రా, నాయనా! కూర్చో.' అని పార్వతి తల్లి ఆదరంతో ఆహ్వానించింది. ఆమెతో కాసేపు మాట్లాడిన తర్వాత – "పారూ ఎక్కడ, అత్తయ్యా!" అని అడిగాడు.

"అదిగో అ వెనక గదిలో ఉంది."

దేవదాసు అక్కడకు వెళ్లాడు. పార్వతి సందె దీపం వెలిగిస్తూ ఉన్నది.

'పారూ!' అని పిలిచాడు.

"చక్రపాణి"

అనువాదం

పార్వతి మొదట చకితురాలయింది. తర్వాత నమస్కారం చేసి ఎడంగా పోయి నిలబడింది.

'ఏం జేస్తున్నావు, పారూ?'

ఇదంతా ముఖ్య ప్రశ్న కాదు—అందుకని పార్వతి మాట్లాడలేదు. అసలు దేవదాసంటే కాస్త సిగ్గుకూడా పడుతూ ఉన్నది.

'ప్రొద్దు కూకింది. వెళ్లొస్తాను. ఒంట్లో కూడా బాగోలేదు.' అని దేవదాసు వెళ్ళి పోయాడు.

### ౫

పార్వతి ఇప్పుడు పదమూడో ఏట పాదం పెట్టిందని వాళ్ల నాయనమ్మ చెప్పుతూ ఉన్నది. ఈ వయస్సులో ఆడ పిల్లలకు శారీరిక సౌందర్యము అకస్మాత్తుగా ఎక్కడ నుంచో ఊడి పడుతుంది. వాళ్ళ చిట్టి వక్కమాటే పెద్దదయిందని తల్లి దండ్రులు ఆశ్చర్య పోతారు. ఇక ఎవరి చేతిలో పెడదామా అని త్రొక్కిస లాడుతారు. చక్రవర్తి గారింట్లో కూడా కొన్నాళ్ళ నుంచి ఈ విషయ మయ్యే చర్చ జరుగుతూ ఉన్నది. అందరి కంటే తల్లికి ఎక్కువగా ఆతురతగా ఉన్నది. మాటల సందర్భంలో మాటి మాటికి—'అదే. పార్వతిని ఇక ఉంచటం భావ్యం కాదు.' అని భర్తతో అంటూ ఉండేది. వారంతా భాగ్యవంతులు కాదు. అయినా పిల్ల చక్కనిదనే ధైర్యం ఒకటి ఉన్నది. ప్రపంచములో రూపానికి గనుక విలువ ఉంటే పార్వతిని గురించి వీరికి ఆలోచించ వలసిన పనే ఉండదు. ఇంకో సంగతి కూడా ఉన్నది—అది ఇక్కడే ఉంచటం ఉచితం. ఇంతకు పూర్వం కుమార్తెల వివాహం చేయటానికి చక్రవర్తుల కుటుంబం అంత తొందర పడేది కాదు—కొడుకుల వివాహానికి పడేది. కుమార్తెల వివాహానికి పణం తీసుకునేవారు—కొడుకుల వివాహానికి పణం ఇచ్చి పిల్లను ఇంటికి తెచ్చుకునే వారు. నీలకంఠుని తండ్రి కూడా కుమార్తె వివాహానికి శుల్కం తీసుకున్నాడు. నీలకంఠునికి ఈ ఆచార మంటే తగని ఏవగింపు. పార్వతిని అమ్మి డబ్బు సంపాయించటం అతని కేమాత్రం ఇష్టం లేదు. ఈ సంగతి పార్వతి తల్లికి కూడా తెలుసును. అందుచేతనే కుమార్తెకు త్వరగా వివాహం చేయమని భర్తను ఒత్తిడి చేసేది. ఇప్పటి వరకు, పార్వతి తల్లి మనస్సులో ఒక దురాశకు చోటిచ్చింది. దేవదాసుతో ఏదో విధంగా పెళ్ళి కావచ్చునని ఆమె అనుకున్నది. ఈ ఆశ గగనకుసుమమని ఆమెకు తోచలేదు. పట్టు పట్టితే దేవదాసు తప్పక పెళ్ళి చేసుకుంటాడని ఆమె విశ్వాసం. బహుశా ఆ నమ్మకం తోటే, నీలకంఠుని తల్లి దేవదాసు తల్లి దగ్గర ఒక నాడు ఈ ప్రసంగం ఎత్తింది.

"చూడు అమ్మాయి! దేవదాసుకూ మా పారుకూ ఎంత స్నేహమో! అలాంటి అన్యోన్యత నే నెక్కడా చూడలేదు."

"ఎందుకుండదు పెద్దమ్మా? వాళ్ళిద్దరూ ఒక్క కడుపున పుట్టిన బిడ్డల లాగా చిన్నప్పటి నుంచీ పెరిగారు."

"అదేను, అమ్మాయీ—అందుకనే అనుకుంటూ ఉంటాను, వాళ్లిద్దరికీ—ఇదిగో దేవదాసు కలకత్తా వెళ్లి నప్పుడు చూచావుగా, దానికి ఎనిమిదేళ్లకూడా నిండలేదు. ఆ వయస్సులోనే వాడి కోసం తిండీ తిప్పలు మాని కట్టెపుల్ల లాగయింది. మనందరికీ తెలుసుగా—దేవదాసు దగ్గరనుంచి ఉత్తరం ముక్క వస్తే దానికి పండగలా ఉండేది!"

దేవదాసు తల్లి దీని భావం గ్రహించింది. కొంచెం నవ్వుకుంది కూడా. ఈ నవ్వులో హేళన ఎంత ఉన్నదో తెలియదు కాని వేదన మాత్రం చాలా ఉన్నది. ఈ సంగతులన్నీ ఆమెకూ తెలుసును. పార్వతి మీద ప్రేమకూడా ఉన్నది. కాని వారి వంశము పిల్లలను అమ్ముకొనేది! పైగా పొరుగు పిల్ల? ఛీ, ఛీ!

"ఇప్పుడు పెళ్ళి చేయటానికి వారికి బొత్తిగా ఇష్టం లేదు పెద్దమ్మా! అందులో చదువుకొంటూ ఉన్నాడు. మా పెద్దబ్బాయి, ద్విజదాసు పెళ్ళి చిన్నప్పుడే చేయటంవల్ల వాడి చదువంతా నాశనమయిందని నన్నిప్పటికీ దెప్పుతూ ఉంటారు."

పార్వతి నాయనమ్మ నిరుత్సాహపడింది. అయినా అని చూచింది:

"అదంతా నాకూ తెలుసు అమ్మాయీ! నువ్వెరుగెదువుగా, పార్వతి కాస్త కాలు బారు పిల్ల—పైగా ఏపున కూడా పెరిగింది—అందుకనే—నారాయణ ఇష్టపడకపోతే—"

దేవదాసు తల్లి అడ్డు వచ్చింది:

"కాదు పెద్దమ్మా! నే నిక వారికి చెప్పలేను. ఇప్పుడు గనక దేవదాసు పెళ్ళి సంగతి ఎత్తితే, వారిక నాముఖం కూడా చూడరు."

ఈ ప్రసంగం ఇంతటితోనే అణగి పోయింది. కాని ఆడవాళ్ళ కడుపులో ఏదీ దాగదు. భర్త భోజనం చేస్తూ ఉండగా దేవదాసు తల్లి ఈ ప్రసంగం ఎత్తింది:

"ఇవ్వాళ పారూ నాయనమ్మ దాని పెళ్ళి సంగతి తెచ్చింది."

"ఆఁ, పారూకు ఈడు వచ్చింది. త్వరగా పెళ్ళి చేయటమే మంచిది." అన్నాడు భర్త తల ఎత్తి.

"అందుకనే, ఇవ్వాళ ఆ ప్రసంగం ఎత్తి, దేవదాసుకు—"

"నువ్వేమన్నావు?" అన్నాడు భర్త ముఖం చిట్లించి.

"నే నింకేమంటాను! పిల్ల లిద్దరికీ సావాసమని ఆ పిల్లను కోడలుగా తెచ్చుకుంటానా? అసలే పిల్లలను అమ్ముకునే వంశం. పైన పొరుగు కుటుంబం—ఛీ—ఛీ!"

భర్త సంతృప్తి పడ్డాడు: "అంత కాక! కులం వాళ్లలో నవ్వించుకుంటామా? నువ్వు అసలు ఈ మాటలే చెవిని పెట్టబోకు." అన్నాడు.

"అబ్బే, నేను వింటానా? మీరు కూడా పొరపడకండి." అన్నది భార్య, పొడి నవ్వు నవ్వి.

భర్త ముఖం గంభీరంగా పెట్టి— "అలాగైతే, ఈ జమీందారీ ఏనాడో పోయేది." అన్నాడు.

వారి జమీందారీ చిరస్థాయిగా ఉన్నా ఎవరికీ ఆక్షేపణ లేదు. కాని నేనుపార్వతి దీన చరిత్ర మాత్రం చెప్పుతున్నాను.

ఈ సంగతి నీలకంఠుని చెవిని పడగానే తల్లిని పిలిచి— "నువ్వు వారితో ఎందుకు చెప్పబోయా వమ్మా?" అని తిరస్కారంగా అడిగాడు. తల్లి మాట్లాడ లేదు.

"పిల్ల పెళ్లి చేయటానికి మనకు కాళ్ల పుచ్చుకు తిరగాల్సిన అవసరం లేదు—మన కాళ్లే పుచ్చుకుంటారు. పైగా మన అమ్మాయి అనాకారి కాదు. నేను ఇప్పుడే చెప్పుతున్నాను, చూడు—ఒక్క వారంలో సంబంధం కుదుర్చుకు వస్తాను! పెళ్లి కాదని దిగు లెందుకు?" అన్నాడు.

కాని ఎవరికోసమైతే తండ్రి శాద్ది చేశాడో, ఆమె నెత్తిన పిడుగు పడింది! దేవదాసు మీద తనకు కొంచెం అధికార మున్నదని పార్వతికి చిన్నప్పటినుంచీ నమ్మింది. ఈ అధికారం ఆమె కెవ్వరూ ఇచ్చింది కాదు. ఆమెకు తెలియకుండానే ఆమె అశాంత మనస్సు నెమ్మదిగా, నిశ్శబ్దంగా, కాని దృఢంగా ప్రతిష్ఠించుకుంటూ వచ్చింది. దాని బాహ్య ఆకృతి ఏమీ ఇంతవరకు ఆమెకు కనపడక పోయినా ఇవ్వాళ ఆ అధికారం పోతున్నదని తెలియగానే ఆమె హృదయంలో భయంకరమైన తుపాను రేగింది.

దేవదాసు లెఖ్ఖ వేరు. అతడు చిన్నతనంలో పార్వతి మీద పూర్తి అధికారం సంపాదించాడు—చలాయించాడు కూడా. కలకత్తా వెళ్లిన తర్వాత చదువు-సంధ్యల్లోనూ, ఆట పాటల్లోనూ పార్వతిని చాల భాగం వదలివేశాడు. పార్వతి గ్రామ్య జీవితంలో రాత్రిం బగళ్ల తననే స్మరించుకొంటున్నదని అతనికి తెలియదు. ఇంతే కాదు; చిన్నప్పుడు ఎవరినైతే తన వారని పూర్తిగా నమ్మాడో, న్యాయా న్యాయ విచక్షణ లేకుండా ఇంత కాలం ఎవరి మీద తన అధికారం అంతా చలాయించాడో, అట్టి వారిని, యౌవనంలో అడుగు పెట్టగానే—ఇలా హఠాత్తుగా వదిలిపెట్టవలసి ఉంటుందని అతను ఊహించ లేదు. అప్పుడు వివాహం సంగతి ఎవరు ఆలోచిస్తారు? ఆ కిశోర బంధనం వివాహం మినహా ఏవిధంగానూ స్థిర పడదని ఎవరికి తెలుసు?

అందుకనే, "దేవదాసుతో వివాహం జరగదు." అనే వార్త పార్వతి హృదయంలోని కోరికల్నీ, నమ్మకాల్నీ తోసివేయ నారంభించినది. దేవదాసు ఆమెకు ఒంటిరిగా కనుపించ లేదు. అతను తరుచుగా బయటకు రావటం లేదు. ఉదయం చదువుకుంటూ ఉండేవాడు. మధ్యాహ్నం ఎండగా ఉంటుందని ఇల్లు కదిలేవాడు కాదు. ఒక్క సాయంత్రం మాత్రం—అదీ ఇష్టమున్న రోజున—బయటకు వచ్చేవాడు. కోటూ పంట్లాం తొడుక్కొని, బూట్లు వేసుకొని, కర్ర చేత పట్టి—చక్రవర్తిగారి ఇంటి ముందుగానే—షికారుకు వెళ్ళేవాడు. పార్వతి కిటికీ దగ్గర నిలుచుని కళ్లు తుడుచుకుంటూ చూసేది. ఎన్నో సంగతులు జ్ఞాపకం వచ్చేవి. ఇద్దరం పెద్దవారం అయామని అనుకునేది. చాలా కాలం ప్రవాసంలో ఉండటం చేత ఇద్దరూ సిగ్గు పడేవారు. ఆ రోజున దేవదాసు సిగ్గుపడి సరిగ్గా మాట్లాడ కుండా వెళ్లి పోయాడు. ఈ సంగతి పార్వతి గ్రహించక పోలేదు.

దేవదాసు కూడా ఇలానే భావించే వాడు. అప్పుడప్పుడు పార్వతితో మాట్లాడాలను కొనేవాడు. కాని, ఇది చుట్టానికి బాగా ఉంటుందా అని మరల సందేహించేవాడు. అక్కడ కలకత్తాలో మాదిరి కోలహలం లేదు: సినిమా డ్రామాలు లేవు; ఆట పాటలు లేవు—అందుకనే చిన్ననాటి సంగతులు జ్ఞాపకం వచ్చేవి. 'అరే, అలాంటి పార్వతి ఇలా అయిపోయిందా' అని అనుకునేవాడు. పార్వతి కూడా 'అప్పటి దేవదాసు ఇప్పుడు దేవదాస బాబుగా మారాడా?' అని అనుకునేది. దేవదాసు ఇప్పుడు విశేషించి చక్రవర్తి గారింటికి వెళ్లటం లేదు. ఎప్పుడన్నా ఒక రోజున షికారుకు వెళ్లే టప్పుడు వాకిటి దగ్గరకు వచ్చి—"ఏం చేస్తున్నారు, అత్తయ్యా?" అని పిలిచేవాడు.

"రా నాయనా! వచ్చి కూర్చో." అని పార్వతి ఆహ్వానించేది.

"ఇప్పుడు కాదులే అత్తయ్యా, కాస్త తిరిగి వస్తాను." అని అనేవాడు.

ఇలాంటప్పుడు పార్వతి ఒక్కొక్క రోజున వెనక ఇంట్లో ఉండేది. ఒక్కొక్క రోజున ఎదుట పడేది. దేవదాసు తల్లితో మాట్లాడుతూ ఉంటే పార్వతి చల్లగా అక్కడ నుంచి తప్పుకు వెళ్లేది.

మన రాజకీయాలు

# తుపాకిని బారుచేసి సైన్యంలో చేర్చుకొనే బిల్లు

ముస్లింలీగ్‌లో నాయకులకూ, అనుచరులకూ మధ్య వైరుధ్యాలు—చైనాకు గాంధీగారి "సందేశం"—తిరువాన్కూరులో శాసనోల్లంఘనం—పటేల్‌గారి పటాటోపం.

## ఏమిచేయాలి?

భారత శాసనసభలో యుద్ధ ప్రతికూల ప్రచార నిరోధక బిల్లు ప్యాసయింది. యుద్ధములో చేరవద్దని యికముందు ప్రచారంచేస్తే అది నేరంగా పరిగణించబడు తుంది. ఈ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపవలసినదని సత్యమూర్తిగారు తెచ్చిన ప్రతిపాదనకు ముస్లింలీగువారు వ్యతిరేకించారు. అందువల్ల ప్రతిపాదన వీగిపోయింది. కాని, ప్రభుత్వం కొన్ని సవరణలను అంగీకరించింది. వీటి ప్రకారం రాష్ట్రీయ ప్రభుత్వపు అంగీకారం లేనిదే ప్రాసిక్యూషన్ చేయకూడదు; శిక్ష 2 సంవత్సరముల నుండి 1 సంవత్సరమునకు తగ్గించబడింది. వెంటనే పంజాబుకు వర్తింప జేయాలను సూత్రం తొలగించబడింది.

ఈ బిల్లును కాంగ్రెసు, నేషనలిస్టు పార్టీవారు మొదటి నుంచీ ప్రతిఘటించారు. "ప్రపంచ శాంతిని భంగపరచుటలో బ్రిటిషు సామ్రాజ్యం యితర దేశాలను మించిపోయింద"ని సత్యమూర్తిగారు గర్జించారు. "తుపాకిని బారుచేసి భారతీయులను సైన్యంలో చేర్చుకొనుటకు యీ బిల్లు ఉపయోగ పడుతుంది. భారత దేశమే యుద్ధం చేయుటకు శక్తిని కలిగి యుంటే గ్రేట్‌బ్రిటన్‌పై మొట్టమొదట యుద్ధం ప్రకటించి యుండేది" అని అబ్దుల్ ఖయూం (సరిహద్దు శాసన సభ్యుడు) గారు తెలియజేశారు. "ఈ బిల్లు శాసనం అయితే, ఉన్న శాసనములన్నిటిలోనూ నిరంకుశమైనది"ని భులాభాయి దేశాయిగారు నిరూపించారు. దీనికి అనుకూలంగా వోటుచేసే వారంతా దేశద్రోహం చేసిన వారౌతారని దేశాయిగారు ధైర్యంగా పలికారు.

కాని, జిన్నా-అతని పార్టీ (ముస్లింలీగ్) వారు దేశద్రోహమే చేశారు. సత్యమూర్తిగారు చెప్పినట్లు, జిన్నాయొక్క ఉపన్యాసం అంతా బిల్లుకు వ్యతిరేకంగాను, వోట్లు మాత్రం అనుకూలంగాను యిచ్చాడు. పర్యవసానం 8 వోట్ల వారతమ్యంతో బిల్లు ప్యాసయింది. ముస్లింలీగ్ నాయకులు మరొక విధంగా చేస్తారని అనుకోవడం తెలివి తక్కువ.

అయితే, ఇప్పుడు చేయవలసిన పనియేమి? ఇండియా ఆక్టు ప్రకారం యీబిల్లు రాష్ట్రీశాసన సభలలో కూడా చర్చించి, వోట్లు తీసుకోవచ్చునని న్యాయశాస్త్రములో ఆరితేరిన భులాభాయి దేశాయిగారు సహేతుకంగా వాదించారు. వెంటనే, కాంగ్రెసు ప్రభుత్వం అమలులో ఉన్న 7 రాష్ట్రీ శాసన సభలలోను యీ బిల్లు పనికి రాదని తీర్మానించాలి.

మరొకవైపు, ప్రజలలో బిల్లుకు వ్యతిరేకంగా విపరీతమైన ఆందోళనను లేవదీసి, యుద్ధ ప్రతికూల ప్రచారం మొదలుపెట్టాలి. పంజాబ్ రాష్ట్రీ కాంగ్రెసు కమిటీ వారొక చక్కని తీర్మానం చేశారు. సెప్టెంబరు 4వ తేదీని రాష్ట్రమంతటా యుద్ధ ప్రతికూల ప్రచారం కొరకు ప్రత్యేకించ బడింది. అదే విధంగా, ఇతర రాష్ట్రములలో కూడా యుద్ధ ప్రతికూలోద్యమాన్ని లేవదీయాలి. ఇందుకు రాష్ట్రీ కాంగ్రెసు కమిటీలు పూనుకొన వలసియుంది. హరిపూర్‌లో ఆమోదించబడిన యుద్ధ ప్రతికూల తీర్మానం ఆచరణలో పెట్టవలసియుంది.

ప్రపంచ యుద్ధం మనతోచెప్పి రాదు. వస్తే, భారతీయులు మర ఫిరంగులకు, యుద్ధ విమానములకు, విషవాయువులకు సామ్రాజ్య వాదుల కోసం గురికావలసి వస్తుంది. కాబట్టి, కాంగ్రెసు కమిటీలు ఇప్పటి నుంచీ మెలకువతో కార్యాచరణకు పూనుకోవాలి.

## నాయకులు— అనుచరులు.

ఒకవైపు ముస్లింలీగ్ నాయకులైన జిన్నా మొదలైనవారు బ్రిటిష్ నిరంకుశ ప్రభుత్వానికి దాసోహం చేస్తూంటే, మరొకవైపు వారి అనుచరులు సామ్రాజ్య వ్యతిరేకోద్యమంలో పాల్గొంటున్నారు. కాన్పూరులో జరిగిన స్థానిక ముస్లింలీగ్ సమావేశంలో ఎసంబ్లీ ముస్లింలీగ్ పార్టీ సభ్యులను ఖండిస్తూ ఒక తీర్మానమును, సామ్రాజ్య యుద్ధాలలో ముస్లిం ప్రజలెవరూ పాల్గొన కూడదని వేరొక తీర్మానమును చేయబడ్డాయి.

పాలస్టయిన్‌లో బ్రిటిషు ప్రభుత్వం అరబ్బులపై జరుపుతూన్న అక్రమాలను గర్హించుటకు ముస్లింలీగ్ యాజమాన్యమున దేశమంతటా 26-8-38 వ తేదీని మహమ్మదీయుల ఊరేగింపులు, బహిరంగ సభలు జరిగాయి. బొంబాయి, సంయుక్త పరగణాలు, బీహార్, మదరాసు మొదలైన రాష్ట్రములలో బ్రహ్మాండమైన సభలు, ఊరేగింపులు జరిగాయి. బ్రిటిష్ ప్రభుత్వం యొక్క పాలస్టయిన్ విధానమును ఖండిస్తూ ఉపన్యాసములూ, తీర్మానాలూ చేయబడ్డాయి.

ఒకవైపు, ముస్లింలీగ్ సభ్యులెవరూ కార్మిక, కర్షక సంస్థలలో పనిచేయ కూడదని లీగ్ నాయకులు తీర్మానించి యుండగా, కాన్పూర్ కార్మిక సంఘం యొక్క సాంవత్సరిక ఎన్నికలలో ముస్లింలీగ్ సభ్యులు కూడా కమ్యూనిస్టులతో బాటు కార్యనిర్వాహక వర్గమునకు ఎన్నుకోబడ్డారు.

మలబార్ తిరుగుబాటును అణచుటలో ప్రఖ్యాతిగాంచిన హిచ్‌కాక్ యొక్క శిలావిగ్రహమును తీసివేయ వలసినదిగా మాప్లా ప్రజలు మదరాసు ప్రభుత్వానికి విన్నవించుకున్నారు. నవంబర్ 10 వ తేదీ లోగా తీసివేయకపోతే సత్యాగ్రహం ప్రారంభిస్తాం అని నోటీసు యిచ్చారు.

ఈ మాప్లాలంతా మహమ్మదీయులే.

ఈవిధంగా ముస్లింలీగ్ నాయకులకూ, ముస్లిం ప్రజలకూ మధ్య వృద్ధి పొందుతూన్న వైరుధ్యాలను గ్రహించి, స్థానిక కాంగ్రెసు కమిటీలు ముస్లింలీగ్ కమిటీలతో ఐక్య సంఘటనకు దిగాలి. 1921 వ సంవత్సరంలో ఒకవైపు అసహాయోద్యమం, మరొకవైపు ఖిలాఫత్ ఉద్యమము ఏ రీతిగా ప్రభుత్వాన్ని ఊపివేశాయో పాఠకులు జ్ఞప్తికి తెచ్చుకొనవలసియుంది.

## గాంధీగారి అహింస

గాంధీగారి అహింసా సిద్ధాంతం సామాన్య ప్రజలకు అర్థం అయినా కాకపోయినా ఆయన చేసే ప్రకటనలను మిల్లు యజమానులు ఆధారంగా తీసుకొని, కార్మికోద్యమాన్ని అణచుటకు అవకాశం ఏర్పడుతోంది. కార్మికులు యితరులను లోనికి వెళ్ళకుండా అడ్డుగోడల వలె నిలబడి ఆటంక పరచుట శాంతియుతమైన పికెటింగు కాజాలదని క్రిందటివారం హరిజన్ పత్రికలో గాంధీగారొక వ్యాసం వ్రాశారు. దానిపై అనేక విమర్శలు వచ్చాయి. వాటికి జవాబిస్తూ ఆయన మరొక వ్యాసం వ్రాశారు. దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహోద్యమములోను, ఇండియాలో బెనారస్ విద్యార్థుల పికెటింగు విషయంలోను ఒరులను ఆటంక పరచే పికెటింగు చేయవద్దని తాను సలహా యిచ్చినట్లు వ్యాసంలో వ్రాశారు. అయినప్పటికీ ఎల్లప్పుడూ ఒకే అభిప్రాయానికి అంటిపెట్టుకొని యుండాలనే మూర్ఖత అల్ప మనస్కులనుగాని తనను బాధించవని కూడా గాంధీగారు వ్రాశారు.

మొత్తంమీద, పికెటింగును గురించి గాంధీగారు ప్రకటిస్తున్న అభిప్రాయాలవల్ల జాతీయోద్యమానికి కార్మికులకూ మధ్య ఉండవలసిన అవినాభావ సంబంధం తెగుటకు అవకాశం ఏర్పడుతుంది. ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో ప్రజలు తమ చేతులలో ఉన్న ఉప్పును ఈయకుండా గట్టిగా బిగించి పోలీసులకు కావలసినంత శ్రమ యిచ్చారు; లాఠీ ఛార్జీలవల్ల వారి చేతులు కాయలు కాచిపోయాయి. కల్లు దుకాణముల కెదురుగా అడ్డుగోడవలె నిలువబడి వాలంటీర్లు పికెటింగు చేశారు. గవర్నమెంటును "సైతాన్" ప్రభుత్వంఅని గాంధీగారే ఆరోజుల్లో అన్నారు. బ్రిటిష్ వస్తువులను బహిష్కరించాలని ప్రచారం సాగింది. సీమ గుడ్డలు గడ్డి మేటులవలె దహనం చేయబడ్డాయి.

ఈ కార్యక్రమం అంతా అహింసా సిద్ధాంతం ప్రకారం చేయబడితే, కార్మికుల పికెటింగు మాత్రం ఎందుకు కాదో? ఒరులకు బాధ కలిగించకుండా తానే బాధనంతటినీ అనుభవించుట అహింసా సిద్ధాంతం. కార్మికులు యితర కార్మికుల యెదుట గోడలవలె అడ్డుగా నిలబడి పికెటింగు చేస్తారేగాని వారికి ఎట్టి హింసయు చేయరు. కొట్టరు, తిట్టరు, నిర్బంధించరు. ఎరస్టుచేస్తే పోలీసులు పికెటర్లను ఎరస్టు చేస్తారుగాని, వెళ్ళేవారిని ఎరస్టు చేయరు. ఇట్టి సందర్భాలలో కార్మికులుచేసే పికెటింగు హింస అని పిలుచుటలో అర్థంయేమో గాంధీగారికే తెలియాలి.

చైనా ప్రజలు జపాన్‌వారి దాడిని ఎదుర్కొంటూ తుపాకులతో యుద్ధం చేస్తున్నారు. కాంగ్రెసు సంస్థ చైనా ప్రజల పోరాటానికి సానుభూతిని ప్రకటించింది. చైనా నుండి ప్రొఫెసర్ 'శాజ్' అనే ఆయన చైనా ప్రజలకు సందేశ మీయవలసినదిగా గాంధీగారి వద్దకు పోతే, యీ క్రింది సందేశం యిచ్చారు. నేడు చైనా దేశస్థులు ఆత్మరక్షణ కొరకు యుద్ధం చేస్తున్నారు. కాని, ఇతర విషయాలలో వారు అహింసా పద్ధతులనే స్వీకరించారు..... యుద్ధంలో ప్రేమ అనేది ఉండదు. సంపూర్ణమైన అహింసా విధానమో, కత్తిలేని హింసా విధానమో—ఏదో ఒకటి మాత్రమే ఉండాలి. ఈ సందేశం సరిపోవును కాదా?"

మిల్లు యజమానుల సహాయానికి కాంగ్రెస్ మంత్రులు పోలీసులను, మిలిటరీని పంపి కార్మికుల హక్కులను అరికట్టుట గాంధీగారి ఉద్దేశంలో అహింస. చైనా ప్రజలు "ఆత్మరక్షణ" కొరకు చేస్తూన్న యుద్ధం మాత్రం హింస!

ఈ విధంగా, 'హింస—అహింస' సిద్ధాంతాలను గురించి గాంధీగారు చేస్తూన్న వ్యాఖ్యానాలు, మీమాంసలు సామాన్యులను గందరగోళం పరచడమే గాక, స్వాతంత్ర్య పోరాటంలో గమ్యస్థానాన్ని మరచిపోయేటట్లు కూడా చేయగలవు. ఆయుధ బలం ఉన్న చైనా ప్రజలు ఆయుధాలతోను, లేని భారతీయులు శాంతి పద్ధతులతోను పోరాటాన్ని సాగించుట స్వాభావిక లక్షణం. పద్ధతులెట్టివైనా, చైనా దేశస్థులు చూపుతూన్న త్యాగశక్తిని, ధైర్య సాహసములను ఏ భారతీయుడు కొనియాడకుండా ఉండగలడు?

## పటేల్‌గారి పటాటోపం

"ప్రపంచ కార్మికులంతా ఏకం కావాలి". "ఇండియాలో కూడా సోవియట్ ప్రభుత్వం స్థాపించాలి" అనే ఆశలు వ్యర్థమైనవని వల్లభభాయి పటేల్‌గారు యీ మధ్య నాలుగైదు బహిరంగ సభలలో ఉపన్యసించారు. హరిపూర్ కాంగ్రెసు సమావేశంలో తాను సోషలిస్టులను సహించలేనంటూ సింహగర్జన చేసినది వీరే!

పైరెండు ఆదర్శములను సోషలిస్టులు చేరుకొనుటకు ప్రయత్నిస్తున్నారు. మన దేశంలో కూడా అంతే. కాని, ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వం ఉండగా సోవియట్ ప్రభుత్వాన్ని స్థాపించగలం అనే పిచ్చిఊహ ఏ సోషలిస్టుకూ లేదు. కనుకనే మొదట సంపూర్ణ స్వరాజ్యం స్థాపించాలి అని సోషలిస్టు లంటారు. సంపూర్ణ స్వరాజ్యం సిద్ధించక పూర్వం కాంగ్రెసు వారు మంత్రి పదవులలో ఉండి ప్రజలకు తాము చేయగలిన సహాయం చేయుట చూస్తున్నాం. అదేవిధంగా, ఇండియాలో సోషలిస్టు సమాజాన్ని స్థాపించుటకు పూర్వం సోషలిస్టులు స్వరాజ్య సిద్ధికి పాటుపడుతున్నారు. ప్రపంచ కార్మికులంతా ఏకం కావడం సోషలిస్టుల ఆదర్శం అనే మాట నిజమే. కాని, ఇండియాలోని కార్మికవర్గం కూడా ఏకం కావాలని వారు కోరుతారు. కార్మికులతోబాటు బ్రిటిషు సామ్రాజ్యవాదులచే పీడింపబడు యితర ప్రజలు కూడా ఏకం కావాలనేది వారి ఆశ.

ఒకవేళ ఇట్టి "ఆశ"లు వ్యర్థమే అయినట్టయితే, వ్యర్థమైన వీటిని గురించి పటేల్‌గారు యింతగా బహిరంగ సభలలో ప్రచారం ఎందుకో?



## పాఠకులకు

వినాయక చవితి ఈ వారములో రావడము వలన ఈ వారము 20 పుటలే ప్రకటించ బడ్డాయి. వచ్చే వారము నుండి మామూలుగనే 24 పుటలతో వెలువడును.

—మేనేజరు.

## ఒరిస్సాలో కాంగ్రెసు మంత్రులు

ఒరిస్సా జైళ్ళ రూల్సు మారుస్తూ అక్కడి మంత్రి వర్గంవారు రాజకీయ ఖైదీ లందరినీ "ఏ" క్లాసులో ఉంచవలసిందని బంధనచేశారు.

మన మదరాసు మంత్రులు కూడా యిట్టి సంస్కరణ చేస్తే బాగుంటుందేమో!

## రాజకోట సంస్థానంలో రాక్షసత్వం.

సంస్థాన ప్రజలు పౌరసత్వ హక్కులకై తీవ్రమైన ఆందోళన ప్రారంభిస్తే, రాజకోట సంస్థాన ప్రభుత్వం యీ ఆందోళనను అరికట్టుటకు 144 వ సెక్షన్ ప్రయోగించి, సభలు జరుగరాదని నిషేధాజ్ఞలను జారీ చేసింది. కాని, ప్రజలు మాత్రం పట్టుదల విడువక, సభలు చేయసాగారు. ఒక్కొక్క సభకు అనేక వేలమంది చొప్పున హాజరు అయేవారు. దీనితో ప్రభుత్వం కంగారు పడింది. సభలలో లాఠీ ఛార్జీలు, ఇండ్లలో సోదాలు, నాయకుల ఎరస్టులు ప్రారంభమయాయి. ఒక సభలో 80 మందికి బలమైన గాయాలు తగిలాయి. 9 మందిని ఎరస్టు చేశారు. తరువాత మరికొందరిని ఎరస్టు చేశారు. మొత్తం 36 గురు ఈ విధంగా అరెస్టు చేయబడ్డారు. బొంబాయి, మొదలైన పట్టణాల్లో యీ దురంతములను గురించి విపరీతమైన ఆందోళన ప్రారంభమైంది. ఒక సభలో వల్లభభాయి పటేలుగారు ఉపన్యసిస్తూ సంస్థాన ప్రభుత్వపు చర్యలను తీవ్రంగా గర్హించారు.

దీనితో సంస్థాన ప్రభుత్వం భయపడింది. ఎరస్టు చేయబడినవారిని విడుదలచేసి, 144 వ సెక్షన్ రద్దుచేసింది.

## హైదరాబాదు.

### పత్రికలపై నిషేధపుటాజ్ఞ.

16 పత్రికలపై హైదరాబాదు ప్రభుత్వము నిషేధాజ్ఞను ప్రకటించింది. అవి బ్రిటిషు ఇండియాలోని పత్రికలు. వీటిలోని భాగాలను ప్రకటించుటగాని, అమ్ముటగాని, అన్నియు నిషేధింపబడినవి. ఇవి "పౌరసత్వపుహక్కులు"!

## తిరువాన్కూరు.

### ఘోర హింసలు, అరెస్టులు లాఠీఛార్జీలు, ఆర్డినెన్సులు.

త్రివేంద్రంలో రైల్వే మైదానం వద్ద సభలు జరుపరాదని తిరువాన్కూరు ప్రభుత్వం ఆర్డర్లు జారీ చేసింది. 25 వ తేదీని స్థానిక యువజన సంఘం దానిని ఉల్లంఘించింది. వేలకువేలు ప్రజలు సభకు వచ్చారు. ప్రజలపైనను, యువజన సంఘ సభ్యులపైన లాఠీ ప్రయోగం చేయబడింది. అప్పుడే ప్రజలందరూ ఊరేగింపులో వేరొక మైదానానికి పోయి ప్రభుత్వ దుండగాలను ఖండిస్తూ సభ జరిపిరి.

ఒక కొత్త ఆర్డినెన్సు ద్వారా, తిరువాన్కూరులో యువజన సంఘము, స్టేట్ కాంగ్రెసును అక్రమ సంఘాలుగా ప్రకటింపబడినవి. వాటికి సహాయం చేసేవారు శిక్షింప బడతారు. వాటి ఆఫీసులు ఆస్తులు అన్నీ ప్రభుత్వం వశపర్చునవచ్చు.

### శాసనోల్లంఘనము

ప్రభుత్వపు యీ నిరంకుశ శాసనాన్ని ధిక్కరిస్తూ స్టేట్ కాంగ్రెసు, యువజన సంఘాలు సభలు జరిపినవి. త్రివేంద్రములో ప్రభుత్వపు అక్రమాలను ఖండిస్తూ రైల్వే మైదానంలో సభ వేరొకటి ఏర్పాటు చేయబడింది. పోలీసులు ఆప్రాంతాన్ని కాపలా కాస్తున్నారు. మైదానం చుట్టూ వారు కార్డన్‌గా ఏర్పడ్డారు. ప్రజలు వీరిని లెక్క చేయకుండా వేలకు వేలు మైదానంలోనికి పోయారు. సభలో యువజన సంఘ సభ్యులు ఉపన్యసించారు. ప్రభుత్వ నిరంకుశ శాసనాలను ఖండిస్తూ తీర్మానాలు చేయబడినవి. సభ జయప్రదంగా జరిగింది.

నాగర్‌కోయిల్‌లో మహారాజు యొక్క భవనం పక్కనున్న మైదానంలో సభ జరిపి ప్రభుత్వపు అక్రమాలను ఖండిస్తూ తీర్మానాలు చేశారు. సభకు వేలకొలది జనులు హాజరయారు.

కొత్తాయం, అల్లెప్పీ, క్విలన్ మొదలగు ప్రదేశాలలో ప్రభుత్వ శాసనాన్ని కాంగ్రెసు నాయకులు ధిక్కరించారు. కొత్తాయంలో జా[illegible] ఫిలిప్పోస్‌గారికి 13 నెలల శిక్ష, రు 1600 లు జరిమానా విధించారు. అల్లెప్పీలో వి. కె. [illegible] కుంజువర్గీ[illegible] ఇద్దరికి 7 నెలల శిక్ష. రు 550 జరిమానా విధింపబడింది.

స్టేట్ కాంగ్రెసు అధ్యక్షులు పోత్తామ్ థాను పిళ్ళేగారికి 1 సంవత్సరం విడిఖైదు విధించారు. ప్రభుత్వపు చర్యపట్ల అసమ్మతి తెల్పుతూ చాలాచోట్ల హర్తాళు జరిగింది.

ప్రభుత్వపు నోటీసులు నిరాఘాటంగా జారీ చేయబడుతున్నాయి. జి. పి. నీలకంఠం పిళ్లే, యం. వి. మాథ్యూగార్లు అరెస్టు చేయబడ్డారు. అరెస్టులు, శిక్షలు, జరిమానాలు తిరువాన్కూరు సంస్థానంలో విపరీతంగా వ్యాపించి పోతున్నాయి. సభలకు ప్రజలు కూడా వేలకొలది హాజరవుతున్నారు. యీ ఉద్యమమంతా శాంతి యుతంగా జరుగుతోంది.

గాంధీగారి మెప్పులు పొందిన తిరువాన్కూరు సంస్థానంలో ప్రభుత్వ చర్యలివి.

అహింసా సిద్ధాంతాన్ని గూర్చి వ్యాఖ్యానాలు గావిస్తూన్న గాంధీ మహాత్ముడు యీ తిరువాన్కూరు ప్రభుత్వ హింసను ఖండిస్తూ ప్రకటనలు చేయకుండుట శోచనీయము.

ఇందుచేతనే స్వదేశ సంస్థానాలు రద్దు కావాలి; విప్లవం వర్ధిల్లాలి.

## కాన్పూరు

### అతివాదివాదుల విజయం.

కాన్పూరు కార్మిక సంఘ ఎన్నికలలో అతివాదులకు అఖండ విజయం కలిగింది. 10 సంవత్సరాల నుంచి అధ్యక్షుడుగానున్న హరిహరనాథ శాస్త్రిగారిని యూసఫ్‌గారు ఓడించారు. రాజారాం శాస్త్రి మొదలగు వారు ఎన్నికలలో నెగ్గారు. కమిటీలో ప్రతిబింబితమైన కార్మికుల ఈ అతివాద దృక్పథము గత సమ్మె పోరాటాల ఫలితమే. ఇట్టి పోరాటాల ద్వారానే కార్మిక వర్గము జాతీయోద్యమములో ముందుకు పోగలుగుతూంది.

## సప్తమ ఆంధ్రరాష్ట్ర రైతు మహాసభ

### వీరవల్లి, (కృష్ణాజిల్లా)

అధ్యక్షులు: కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తిగారు.

ప్రారంభోపన్యాసకులు: పేట బాపయ్యగారు.
పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు.

కార్యక్రమము.

3—9—38 ఉదయం 12 గం. రాష్ట్ర కార్య నిర్వాహక సంఘ సమావేశము.
సాయం. 6 గం. స్థాయి సంఘ సమావేశము.

4—9—38 ఉదయం 12 గం. ప్రతినిధుల సమావేశము.
సాయం. 1 గం. మహాసభ.

షరా:—వీరవల్లి, బెజవాడ—ఏలూరు రోడ్డుమీద వున్నది. బెజవాడలో దిగి వచ్చువారు ఏలూరు బస్సు యెక్కి వీరవల్లిలో దిగవచ్చును. రైలుమీద వచ్చువారు మద్రాసు—వాల్తేరు లైనులో అంపాపురం స్టేషనులో దిగవలెను. అచ్చట యేర్పాట్లు చేయబడును.

## సింధు మంత్రివర్గానికి సంకటావస్థ

సింధు రాష్ట్రంలో పరిపాలిస్తూన్నది కాంగ్రెసేతర మంత్రివర్గం. సుమారు రెండు నెలల నుంచి అక్కడి మంత్రివర్గం సంకటావస్థలో ఉంది. ప్రతిరోజూ దినదిన గండంగా గడుస్తోంది.

బ్రిటిషు మిల్లు యజమానులకు చౌకబారులో ప్రత్తిని సప్లయి చేయుడానికి ఇండియా గవర్నమెంటు పూనుకొంది. సింధు రాష్ట్రంలో పండే ప్రత్తిపంటను ఎక్కువ చేయడానికి సింధు నదికి ఆనకట్టు ఒక్కటికట్టి, నీటి పారుదలను వృద్ధి చేసింది. కాని, యిందుకు అనేక లక్షల రూపాయలు అప్పు చేయవలసి వచ్చింది. దీన్ని తీర్చాలంటే, ఆ రాష్ట్రీ ప్రజలపై అదనపు పన్ను విధించాలి. మరొక మార్గంలేదు.

ఈమధ్య సింధు రాష్ట్రీమండలి అల్లాబక్షు మంత్రివర్గం ఇండియా గవర్నమెంటు యొక్క ఒత్తిడికి లొంగి, రైతులమీద అదనముగా పన్నులు విధించింది. ఈ నిర్ణయం చేయక పూర్వమే ప్రజాభిప్రాయం తెలుసుకొని యుండవలసింది. లేదా శాసన సభ్యుల అనుమతినైనా తీసుకొని యుండవలసినది. మంత్రి వర్గం యీ రెండిటిలో ఏదీ చేయక అపనింద పాలయింది.

సింధు రాష్ట్రీ శాసనసభలో కాంగ్రెసు పార్టీ యొక్క బలం 10 మంది. కాని, యునైటెడ్ పార్టీ మొదలైన పార్టీలు కాంగ్రెసుతో ఏకీభవించి, మంత్రివర్గం తీసుకున్న నిర్ణయాన్ని ప్రతిఘటించుటకు తీర్మానించు కున్నారు. విశ్వాస రాహిత్య తీర్మానం ప్రతిపాదించుటకు నిర్ణయించు కున్నారు. దీనితో మంత్రులకు ఖంగారు పుట్టింది. 1 సంవత్సరం వరకూ పన్నులు హెచ్చింపబడవని వారు వాగ్దానం చేశారు. కాని, యీ వాగ్దానాన్ని అంగీకరించినట్టు గవర్నమెంటు ఎట్టి ప్రకటన చేయలేదు.

కనుక, విశ్వాస రాహిత్య తీర్మానం తిరిగి ప్రతిపాదింపబడే స్థితి యేర్పడింది.

కాంగ్రెసు సభ్యులకు నేడు ఉన్న బలంతో మంత్రివర్గాన్ని యేర్పరచుట అసంభవం. ఇతర పార్టీలతోను ముఠాలతోను కలసి మిశ్రమ మంత్రి వర్గాన్ని నిర్మించడమా, మానడమా అనే సమస్య కాంగ్రెసు నాయకులకు ఎదుర్కొంది. వల్లభాయి పటేలు, అబ్దుల్ కలాం అజాద్, కృపాలినీగార్లు, కరాచీ స్వయంగా వెళ్ళి, మంత్రివర్గ సభ్యులతోను, ఇతర ఎసంబ్లీ పార్టీ నాయకులతోను, కాంగ్రెసు ప్రముఖులతోను సంప్రతించి, కొన్నినిర్ణయాలకువచ్చారు. మంత్రి వర్గంతో ఒక ఒడంబడిక చేసుకున్నారు. దాని ప్రకారం:

కాంగ్రెసువారు మిశ్రమ మంత్రి వర్గంలో పాల్గొనరు; ప్రస్తుతపు మంత్రివర్గంపై ప్రతిపాదించబడే విశ్వాస రాహిత్య తీర్మానాలను బలపరచరు; ఒక సంవత్సరం వరకూ అదనపు పన్నులు విధించబడవు; ఈలోగా మంత్రులు ప్రజాభిప్రాయాన్ని తెలుసుకుంటారు; పన్నుల విధానాన్ని గురించి మంత్రులు చేసిన సూచనలను అఖిలభారత పార్లమెంటరీ బోర్డు పరిశీలించి, సింధు ఎసంబ్లీ కాంగ్రెసు పార్టీకి సలహా చేస్తుంది; మంత్రి వర్గంవారు కాంగ్రెసు కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టాలి. అంతవరకూ వారికి కాంగ్రెసు పార్టీ సహాయం చేయాలి; ఈ ఉభయులకు అభిప్రాయ భేదం వస్తే కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డువారి నిర్ణయానికి కట్టుబడి ఉండాలి.

ఈ షరతులలో ఆక్షేపణ యేమిలేదు. కాంగ్రెసు కార్యక్రమాన్ని యెవరు ఆచరణలో పెట్టినప్పటికీ వారిని కాంగ్రెసు బలపరిస్తే తప్పేమీలేదు. ముస్లింలీగ్ వారుకూడా కాంగ్రెసు కార్యక్రమాన్ని అమలు పరచుటకు అంగీకరించారు. కాని, అంతిమ నిర్ణయం పార్లమెంటరీ బోర్డుకే ఉండాలి అనే సిద్ధాంతం అంగీకరించలేదు. అల్లాబక్షు మంత్రివర్గం అంగీకరించింది. కనుకనే, వారితో కాంగ్రెసు ఒడంబడిక చేసుకుంది.

ఇండియాలో నేడు 11 రాష్ట్రీ శాసన సభలలో కాంగ్రెసు సభ్యులు మెజారిటీలో ఉన్నారు. అక్కడి మంత్రులంతా కాంగ్రెసు వారే. సరిహద్దు రాష్ట్రంలో అల్పసంఖ్యగా ఉన్నప్పటికీ, కొందరు మంత్రులు కాంగ్రెసువారు. సింధు రాష్ట్రీ శాసనసభలో కాంగ్రెసు వారు 10 మంది మాత్రమే అయినప్పటికీ, మంత్రులు కాంగ్రెసు కార్యక్రమాన్నే అమలు జరుపుటకు అంగీకరించారు.

దీన్నిబట్టి, కాంగ్రెసు యొక్క బలం నానాటికీ వృద్ధి చెందుచున్నదని స్పష్టమౌతుంది.

# లేఖలు

తూర్పు గోదావరి జిల్లా ఆర్థిక రాజకీయ పాఠశాల, రాజమండ్రి.

---

తూర్పు గోదావరి జిల్లా ఆర్థిక రాజకీయ పాఠశాల రాజమండ్రిలో జూలై 15 వ తేదీని ప్రారంభింపబడి, 30 దినములు జయప్రదముగా సాగి, 13 ఆగష్టు '38 వ తేదీని ముగింపబడినది. పాఠశాలకు వివిధ ప్రాంతములనుండి 44 గురు విద్యార్థులు వచ్చిరి. అందు ప్రాథమిక విద్య లగాయతు ఉన్నత విద్య వరకు యున్నవా రున్నారు. వీరు గాకుండా కొందరు వచ్చి 2 లేక 3 రోజులు ఉండి పాఠములు విని వెళ్ళే వారు రమారమి 30 మంది విద్యార్థులు పాఠశాలలోనే బస, భోజనం చేస్తూయుండేవారు. పాఠశాలలో సగటున పూట 1 కి 33 గురు భోజనం, 37 గురు ఫలహారం చేసెడివారు.

పాఠశాల యొక్క కార్యక్రమ మంతయు, విద్యార్థులు, కార్య నిర్వాహకులతో గూడిన పాఠశాల స్థాయి సంఘముచే నిర్ణయింపబడెను. కార్య సంఘమునకు తోడు, విద్యా సంఘము, ప్రచురణ సంఘము, భోజన ఏర్పాట్ల సంఘము, ఆర్థిక సంఘము, పఠన కమిటి, ఆటల కమిటీలు ఏర్పడి తమ తమ విధులను జాగ్రత్తగా నెరవేర్చినవి. ఈకమిటీ లన్నిటిలోను విద్యార్థులు ప్రతినిధులుగా ఎన్నబడిరి.

ఈ దిగువ దిన కార్య క్రమం ఆచరణలో పెట్టబడెను.

ఉదయం

4-30 నిద్రనుండి లేచుట.
5-15 లగాయతు 6-15 వరకు డ్రిల్లు.
6-45 .... .... 7-0 ప్రార్థన. టీ.
7-10 .... .... 7-30 పాటలు.
7-30 .... .... 10-30 పాఠాలు.
10-30 .... .... 11-30 భోజనం.
11-30 .... .... 12-30 విశ్రాంతి లేక వినోదాలు, పత్రికా పఠన.

మధ్యాహ్నం

12-30 .... .... 1-0 హిందీ.
1-0 .... .... 3-0 పాఠాలు.
3-0 .... .... 3-30 టీ.
3-30 .... .... 5-0 చర్చ.
5-0 .... .... 6-30 ఆటలు లేక పట్టణంలోని సభలకు వెళ్ళుట.
6-30 .... .... 7-30 భోజనం.
8-0 .... .... 9-30 పఠనసమితి.

నెల దినములలోను యీ దిగువ అధ్యాపకులు ఆయా సమస్యలను గురించి పాఠములు చెప్పిరి.

కామ్రేడ్ సి. వి కృష్ణారావు
1. భారత దేశ చరిత్ర (కాంగ్రెసు చరిత్ర)
2. ప్రపంచ రాజకీయాలు
.. పి. అనంతం
1. ఆర్థిక శాస్త్రము
2. ఫెడరల్ రాజ్యాంగ విధానం
.. జె. రామలింగయ్య
1. యువజనోద్యమము
2. రైతు, కూలీ సమస్యలు
3. 1935 ఇండియా చట్టము.
శ్రీయుత జి. రామచంద్రరావుగారు
జీవ శాస్త్రము
కామ్రేడ్ పి. సుందరయ్య
సోషలిస్టు, కార్మికోద్యమములు
శ్రీయుత మందేశ్వర శర్మగారు
జమీన్ రైతు సమస్య
కామ్రేడ్ పి. మల్లికార్జునరావు
రాజకీయ భూగోళము
.. అశ్వనీ కుమార్ దత్
1. సాహిత్యము,
2. విప్లవ సిద్ధాంతాలు
శ్రీయుత శ॥ సుబ్బారావుగారు
1. వయోజన విద్య
2. గ్రామ స్వపరిపాలన
.. ఇ. శరభరావుగారు
విద్యార్థి ఉద్యమం
.. ఎం. వి. వి. కె. రంగాచార్యులుగారు
తత్వ శాస్త్రం
కామ్రేడ్ క్రొ. లింగరాజు
ఆధునిక రచన
.. పి. సూర్యనారాయణ
హిందీ
.. చె. రామారావు
బర్మా కార్మికోద్యమం
.. కె. పట్టాభిరామయ్య
1. భారత సైన్యం
2. మినహాయింపు ప్రాంతాలు
.. పు. సత్యనారాయణ
మానసిక శాస్త్రం
.. పి. భయంకరాచారిగారు
చెరశాల సంస్కరణ

ఈ పాఠములకు తోడు దినమునకు ఒక అరగంట కార్మిక, కర్షక గీతములు, ఒక గంట డ్రిల్లు, ఆర్థిక, రాజకీయ సాంఘిక సమస్యలపై ఉపన్యాసాలు. చర్చలు సాగించుట, పత్రికా పఠన, పఠన సమితిలో వేరు వేరు సమస్యల గురించి సందేహములను నివారణ చేసికొనుట, పుస్తకములు చదువుట గలదు. ఇంతే గాక ఆటలు, వినోదాలు, ఊరేగింపులు, సభలు జరిగినవి. మధ్య మధ్య హాస్యాలు, ఒక పర్యాయము సినిమా చూప బడెను. ఆఖరు దినము రాత్రి "సమ్మె" అను నాటకము వేయ బడెను. పట్టణములోని యితర విద్యార్థుల కొరకై వేర్వేరు సమస్యలపై ఉపన్యాసాలు ఏర్పాటు చేయ బడెను.

పాఠశాల ప్రారంభము లగాయితు తుది వరకు అన్ని విషయములలోను జాతీయ ఐక్య సంఘటన అతి జాగరూకతతో ఆ చరణలో పెట్ట బడెను. ఇట్టి ఐక్య సంఘటన జిల్లాలో జరుగుట కిదియే ప్రథమము.

పాఠశాల నిర్వహణకై పలువురు వ్యక్తులు, కాంగ్రెసు రైతు, యువజన సంఘములు, కా. సో. పార్టీ పలు విధముల తోడ్పడిరి. జిల్లా అన్ని ప్రాంతముల వారు విరాళము లొసగిరి.

ఈ దిగువ ఆదాయ వ్యయ పట్టిక పాఠశాల ఆర్థిక స్థితిని వెల్లడించును.

ఆదాయ వ్యయ పట్టిక.

ఆదాయము.

| | |
|---|---|
| విద్యార్థి రుసుము | 51-8-0 |
| విద్యార్థుల వల్ల యితర వసూళ్ళు | 3-0-9 |
| రొఖ్ఖ రూపమున వసూలయిన విరాళములు | 428-15-3 |
| వస్తురూపమున వసూలయిన సామగ్రి విలువ | 76-5-6 |
| మిగిలిన సామగ్రి అమ్మకం | 4-15-0 |
| | 564-12-6 |

వ్యయము.

| | |
|---|---|
| ప్రచురణ | 15-13-6 |
| పోస్టు & టెలిగ్రాఫ్ | 14-13-0 |
| స్టేషనరీ | 7-10-9 |
| పత్రికలు, పుస్తకములు | 14-10-6 |
| సంచారపు ఖర్చులు | 42-4-0 |
| అధ్యాపకుల ఖర్చుల క్రింద యిచ్చినది | 9-4-0 |
| జీతగాండ్ర కిచ్చినది | 41-4-6 |
| బస. దీపము, వగైరా | 42-0-0 |
| భోజనసామగ్రి | 251-12-9 |
| సామగ్రి, సాదరు, నాటకం, కూలీ వగైరా | 24-2-6 |
| నిలవ రొఖ్ఖం, రావలసిన బాకీలు | 101-1-0 |
| | 564-12-6 |

జిల్లాలో యింకను యిట్టి పాఠశాలలు పఠన బృందములు నడిపి,తద్వారా ప్రజల ఆర్థిక-రాజకీయ జ్ఞానమును వృద్ధి చేయుటకు యీ క్రింది వారిని "ఆర్థిక-రాజకీయ విజ్ఞాన సంఘము"గా ఏర్పాటు చేయడమైనది.

సి. వి. కృష్ణారావుగారు (కార్యదర్శి)
పుసులూరి కోదండరామయ్యగారు
కొరపాటి పట్టాభిరామయ్యగారు
పెమ్మెత్స సూర్యనారాయణగారు
పి. అనంతంగారు
రావు వెంకట జగ్గారావుగారు
పుత్సల సత్యనారాయణగారు

అభిమాను లందరు అన్నివిధముల పై సంఘమునకు తోడ్పడెదరని ఆశించుచున్నాను. ఉత్తరప్రత్యుత్తరములన్నియు కార్యదర్శిగారికి — జగన్నాయకపురం, కాకినాడ. అడ్రసుకు జరుపవలయును.

ఇట్లు.
పుసులూరి కోదండ రామయ్య
అధ్యక్షుడు.

★

బెజవాడ పోలీసు దురంతములు.

---

బెజవాడ గవర్నరు పేటలో నున్న కొట్లు వారి వద్ద యీ పట్టణ పోలీసు కానిస్టేబుల్సు వచ్చి వారలు వాడుకొను తూకపు రాళ్ళను, కొల పాత్రములను తీసుకొని వెళ్ళినారు. అందులకు వర్తకులు కారణమడుగగా సదరు రాళ్ల అరిగి పోయినవవనిన్నీ శిఖా వేయకుండా తూచుట అక్రమము అనిన్నీ, యింకా యేవేవో చెప్పినారు. యిందులో చాలా వరకు 1936 లో శిఖా వేయబడి యున్నవనిన్నీ అవి యిప్పుడే మరల శిఖా వేయ నవుసరము లేదనిన్నీ లేని యెడల 4 రోజులు గడు విచ్చిన యెడల శిఖాలు వేయించుకొనెదమనిన్నీ, యిప్పుడు మీరు రాళ్ళను తీసుకవెళ్ళినచో వ్యాపారమునకు భంగము కలుగుననిన్నీ యెంత మొరపెట్టుకున్ననూ అంగీకరించక వారలను దబాయించి సదరు శాస్త్రీలు తీసుక వెళ్ళినారు. యిందులో కొందరు సదరు తేదీ సాయంత్రమున్నూ మరి కొందరు మరుసటి దినముననూ యీ రాళ్ళుగలచోటకు వెళ్లి, వారలు కోరిన రొఖ్ఖము సమర్పించుకొని, వారి వారి రాళ్ళను తిరిగి తెచ్చుకున్నారు. న్యాయముగా వీరు గవర్నమెంటు లా & ఆర్డరులను సంరక్షింప వలసిన వారై యుండి, వీరి పై అధికారుల వలన తనిఖీ చేయు నుత్తరువులు తీసుకుని, రాళ్ల కొలత పాత్రలను పరీక్షించవలసి యున్నది. అయిననూ వీరు పై అధికారులవలన ఉత్తరువులను పొందినట్లు కనుపింపదు. కారణ మేమన పై అధికారుల ఉత్తరువుల మీద వీరు యీ చర్య జరిపినచో మరల లంచములు పుచ్చుకొని వారివి వారలకు తిరిగి యిచ్చుట సంభవించదు. యీ ప్రకారం పై అధికారు లందరిని కను గప్పి అధికారు లందరూ నివసించు బెజవాడ వంటి పట్టణములో నిర్భయముగా చేయుట చాలా విపరీతముగా నున్నది. గాన యీ సంగతి సర్వ జనులకు తెలియపరచడమయినది.

బెజవాడ.
26-8-38

ఇట్లు
ఒక పురవాసి.



# మార్క్సిజము: చారిత్రిక భౌతికవాదము

శ్రీ కస్పా వాసుదేవరావు

(గత సంచిక తరువాయి)

వికృతమును అమానుషమునైన ఫ్యూడల్ సంఘమును తీవ్రతర విప్లవముతో యీ బూర్జువా వర్గము కూలద్రోసి శాస్త్రవిజ్ఞాన, వేదాంతములతో కూడుకున్న సంఘము నొకదానిని నిర్మించుట నిజమైన విషయమే. కాని అట్లు చేయుటలో రెండు వర్గములు కల సంఘము నొకదానిని నిర్మించినది. ఒక వర్గమునకు ఉత్పత్తి సాధన సంపత్తి కలదు. రెండవదాని కా సంపత్తి లేదు. దేశభక్తియను వెర్రికేకలు బూర్జువా వర్గపువే. ఏలనన ఆ శ్రామిక వర్గీయుల కొకదేశమని ఏమియులేదు. ఈ సందర్భంలో మార్క్సు చాల చక్కగ చెప్పినాడు.

"శ్రామికులు దేశీయులు కావలెనని తలచిన వారు రాజకీయ శక్తిని సంపాదింప వలయును. ఇట్లు సంపాదించుటకు గావించు కలహమే నిజమైన వర్గ కలహము"

సంఘము నందలి విరుద్ధ వర్గముల దైనందిన పోరాటమే గతి తార్కికాభివృద్ధికి కారణమగును. ఇట్లే పరస్పర విరుద్ధ విషయ సంఘటన జరిగిన కొంత కాలమునకు సామ్యమేర్పడును. దీనినే Synthesis అందురు. ఈ సిద్ధాంత దృష్టిలో అర్థశాస్త్రము, (Political—economy) తర్కశాస్త్రము (logic) రాజకీయ సూత్రములు (Political doctrins) మొదలగు వానిని చూచినయడల ప్రపంచ పరిస్థితులు విశదముగా తెలియును. ఫ్యూడలిజముండిన్న సమయమున శ్రామిక వర్గము, బానిసత్వం (serfdom) కూడా కలవు. ఈఫ్యూడల్ జీవితమున కాధారమగు ఉత్పత్తి సాధనములను బూర్జువా వర్గము సంగ్రహించి ఫ్యూడల్ సంఘ సౌధమును నిర్మూలనము చేసెను. ఈ బూర్జువా వర్గము దినదినము వృద్ధిగాంచ దొడగినది. కాని దీనికి గూడ పక్కలో బల్లెము ఒకటి కలదు. అదియే శ్రామిక వర్గము. ఈ బూర్జువా సంఘమున ఉత్పత్తి విధానము విపరీతముగ నుండును. కాపిటలిజమ్ వృద్ధి యగుచున్న కొలది శ్రామికవర్గ దౌర్భాగ్యము వృద్ధి యగుచుండును. ఒకప్రక్క ఉత్పత్తి తీవ్రగతి దాల్చుచుండ యింకొకప్రక్క శ్రామిక వర్గమును ఒత్తిడిచేయు శక్తులు (repressive forces) వృద్ధియగు చుండును. బూర్జువా వర్గమునకును, శ్రామిక వర్గమునకును గల యీ విపరీత సంబంధమే బూర్జువా వర్గీయుల సంపత్తి యభివృద్ధి అగుటకు కారణమగును. ఇట్లు నిరంతరము పోరాటమును గావించుచున్న రెండు వర్గములకుమధ్య సంధి గావించు రాజీదారులు కొందరుందురు. బూర్జువా వర్గీయులను ఈ రాజీదారులు పొగడుచూ కార్మికుల కష్టములను కొంచెమైనను తగ్గింపవలసినదిగా కోరుచుందురు. వీరే దయాళులు (Philanthro-pists లేక Humanitarians) అనబడుదురు.

ప్రభుత్వము (State)కు సంబంధించిన విషయములు రాజకీయములు. సంఘాభివృద్ధిలో సంఘమునుండియే ప్రభుత్వము ఏర్పడును. ఈ సంఘమున ఒకదాని కొకటి పొసగని విరుద్ధ విషయములు, విరుద్ధాశయములు కలవు. ఇట్టి విరుద్ధ విషయములుండగా సంఘమును రక్షించుట యనెడి మిషతో ప్రభుత్వము ఒకటి బయలుదేరును. ప్రభుత్వము ఎల్లపుడును ఒక వర్గమునకు పక్షపాతియై యుండును. బూర్జువా వర్గమునకును శ్రామిక వర్గమునకును సంధిఎప్పటికిని పొసగదని ప్రభుత్వము యొక్క పరిస్థితులను విమర్శించి చూచిన తెలియును. ఒక వర్గము యింకొక వర్గముపై అధికారము చలాయించుటకు వీలుకలుగజేయు సాధనమే ప్రభుత్వము. సంఘములోని రెండు విరుద్ధ వర్గముల పోరాటము యొక్క తీవ్రతను ఈ ప్రభుత్వము అణచివేయుచుండును. శ్రామిక వర్గపు పోరాటము యీ ప్రభుత్వము తోడనే. ఇట్టి ప్రభుత్వ నిర్మూలముతో యీ పోరాటశ్రామిక వర్గముకూడ సమాప్తి చెందును. "కాపిటలిజము నుండి సోషలిజమునకు గల్గు సాంఘిక మార్పు చరిత్రలో చిరస్థాయిగా నుండి పోవును." అని మార్క్సు వ్రానినాడు. శ్రామిక నియంతృత్వమును గూర్చి మార్క్సు చాల విపులముగ తెలియజేసెను. ఈ నియంతృత్వము శ్రామిక వర్గమునకు (డెమాక్రసీ) ప్రజాతంత్ర పరిపాలన వంటిది. కాని బూర్జువా వర్గ వ్యవస్థల నిర్మూలనము కొరకే యీ నియంతృత్వము అవశ్యకమైనది. దీనినే సోవియటువిధానము అందురు. శ్రామిక వర్గ నాయకత్వమున నుండు ప్రజా సామాన్య వ్యవస్థ (Mass organisation with worker's vanguard).

భౌతిక వాదమున "సిద్ధాంతము, ఆచరణ" (Theory and Practice) విరుద్ధముగా ఎన్నడును ఉండవు. నైజమును గుర్తించుటయే భౌతికవాద సిద్ధాంతమునకు మూలసూత్రము. ఆచరణలో సరిగా నున్నపుడే సిద్ధాంతము సరియైనదగును. మానవ సంఘమును, చరిత్రను మార్క్సు భౌతికవాద దృష్టిలో గమనించాడు.

"జీవనాధారము కొరకు సంఘమున గావించు వ్యుత్పత్తులలో ఒకానొక విధమగు అవశ్యకమైన సంబంధములు మానవులకు ఏర్పడును. ఈ సంబంధములు మానవుల స్వతంత్రాభిప్రాయములతో నేకీభవింపక పోవచ్చును. (అనగా, మానవులకు ఇష్టమున్నను లేకపోయినను ఆ సంబంధములు ఏర్పడిపోవును.) ఈ ఉత్పత్తి సంబంధములే సంఘము యొక్క ఆర్థిక రూపమును (Economic structure of society) నిరూపించును. ఇట్టి సంఘ వ్యవస్థ మీదనే రాజకీయ పరిస్థితులన్నియు ఆధారపడి యుండును. వర్గ చైతన్యము కూడ ఆయా వర్గముల కాయా పరిస్థితుల బట్టి మారుచుండును. ఇందుమూలమున తెలిసికొన వలసిన దేమనగా, జీవనాధార వస్తు ఉత్పత్తి విధానము మానవుల యొక్క సాంఘిక, రాజకీయ, మానసిక ప్రవృత్తులను నిర్ణయించును. మానవుల అజ్ఞానము యీ ప్రవృత్తులను నిరూపింపదు. వారి సాంఘిక జీవనమే యీ ప్రవృత్తుల నిర్ణయించును. అభివృద్ధి చెందుచున్న యీ ఉత్పత్తి విధానముతో కొన్ని సమయములందు అప్పుడున్న ఉత్పత్తి సంబంధ (Production relationship) ములకు సంఘర్షణ జరుగును. అనగా, ఆ సంఘ పరిస్థితులలో నున్న ఆస్థి సంబంధములతో (Property relation) అభివృద్ధి చెందుచున్న ఉత్పత్తి సంబంధములకు సంఘర్షణ కల్గును. ఇట్టి సమయముననే సాంఘిక విప్లవం ఆరంభమగును. ఆర్థిక పరిస్థితులలో మార్పు కలుగగానే, యీ ఆర్థిక పరిస్థితులమీద ఆధారపడిన సాంఘిక శక్తులన్నియు (ప్రభుత్వము మొదలగునవి) తీవ్రమైన మార్పును చెందును. ఇట్టిమార్పు చెందు సమయమున ప్రాత సాంఘిక వ్యుత్పత్తి సంబంధములు సంకెళ్ళవలె నుండి మార్పు కలుగకుండునట్లు ప్రయత్నించును. ఇట్లు సంఘమున విప్లవము కల్గు సమయమున, ఆర్థిక విషయములలో కల్గు మార్పులను, విజ్ఞాన శాస్త్రమున (science) కల్గు మార్పులను చట్ట (Legal) రాజకీయ, మత, వేదాంత, పరివర్తనములను మనము విమర్శించి చూడవలయును.

పై విషయముల వలన మన మీక్రింద నిర్ధారణకు రాగల్గుచున్నాము.

(1) ప్రకృతియొక్క పరివర్తనములోనే గతి తార్కిక విధానము కలదు.

(2) స్థిరత్వము (Permanent nature) కాక గతియే పరివర్తనము యొక్క రహస్యము. పదార్థ గతి నిజమైనది. దీనిని మనస్సు తెలుసుకొన గల్గుచున్నది.

(3) సామరస్యము (Synthesis) కొరకు మానవులుచేయు ప్రయత్నమే సాంఘిక జీవనము. సాంఘిక పరివర్తనమున కల్గు దశలు (Stages) ఫ్యూడలిజమ్, కాపిటలిజమ్, డెమోక్రసీ, ఇంపీరియలిజమ్ మొదలైనవి. చివరకు కల్గునది ప్రభుత్వములేని సంఘము, అనగా సంఘమే ప్రభుత్వము, ప్రభుత్వమే సంఘము. ఈరెంటికిని భేదము లేకుండ పోవును.

(4) కాపిటలిస్టు పద్ధతులనుండి సంఘము సోషలిస్టు పద్ధతులకు మారు సమయమున పెట్టీ—బూర్జువా వర్గము కూడ నిర్మూలము చెందును. కాపిటలిజము యొక్క అంతములో వర్గములు, వర్గ ప్రాబల్యము నశించిపోవును.

(5) పదార్థ గతి యదార్థము. (Movement is reality).

(6) సాంఘికాభి వృద్ధి చారిత్రాత్మకమైనది. మనసు స్వతంత్ర్యమను కొనునది చారిత్రాత్మకమైన విషయమే.

(7) సోషలిజము నందు మాత్రమే మానవులు నిజమైన స్వేచ్ఛ కల్గియుందురు. వారి స్వేచ్ఛ యితరుల స్వేచ్ఛకు భంగము కల్గింపబోదు.

(8) సంఘాభి ప్రాయమునకు మానవుని స్వతంత్రాభి ప్రాయమునకు నేడున్న ఘర్షణ నేటి సంఘ నిర్మాణము నిర్మూలింప బడగానే నీవు, నేను; నీది, నాది; యనునవి నశించి మనము, మనది యనునవే నిలచిపోయి ఏకత్వము ప్రాప్తించును.

## రైతులోకం

(5 వ పేజీ తరువాయి)

144 వ సెక్షన్ ప్రయోగించబడింది. అనాది నుండియు రైతులు మేపుకొంటూన్న చెరువును జమీందారు స్వాధీనం చేసుకొని, పశువుల ప్రాణాలపై కత్తి కట్టారు. పశువులను మేపుకొంటే, 144 వ సెక్షన్ ఉల్లంఘించినందుకు చర్య తీసుకోబడుతుంది.

కాంగ్రెసు రాజ్యంలో కూడా మా కడగండ్లు తప్పవా? అని రైతులు గొల్లు మంటున్నారు.

## కాశీపట్నం.

ఈ నెల 20 వ తేదీని కాశీపట్నంలో యిచ్చిన 144 వ సెక్షన్ రద్దయింది. 21 వ తేదీని పోలీసు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్, డిప్యూటీ సూపరింటెండెంటు మొదలైన ఉద్యోగస్థులు పాతపాడు గ్రామం వెళ్ళి, రైతులకు—జమీందారుకు మధ్య ఉన్న తగాదాను గురించి విచారణ చేశారు. అనేకమంది ప్రజలు వచ్చి, తమ తమ కడగండ్లను గురించి పూస గుచ్చినట్లు చెప్పారు.

144 వ సెక్షన్ రద్దు అయినప్పటికీ, జమీందారు గారు తిరిగి 107 వ సెక్షన్ క్రిందనున్న 11గురు ముద్దాయీలను ప్రతివాదులుగా చేర్చి, నరసాపురం సబు కోర్టులో 19 వ తేదీని దావా చేశారు. ఈ 11 మంది రైతులు గాని, వీరి తరపు వారు గాని, పాలేర్లు గాని, ప్రాజెక్టు భూమిలోనికి 26 వ తేదీ వరకు వెళ్ళకూడదని జమీందారుగారు ఇంజంక్షన్ ఉత్తరువు పొందినారు.

## నూతక్కిలో భూస్వాముల దౌర్జన్యం.

గుంటూరు జిల్లాలో, మంగళగిరి డివిజన్‌కు చెందిన నూతక్కి గ్రామంలో మాల మాదిగలపై భూస్వాముల దౌర్జన్యం చెలరేగి పోతోంది. గవర్నమెంటు లేబర్ డిపార్టుమెంటు వారు హరిజనులకు నూతులు తవ్వించుట, స్కూళ్ళు పెట్టించుట, ఉచితంగా భూమి లిప్పించుట మొదలైన సౌకర్యాలు చేయిస్తూన్నప్పటినుంచీ నూతక్కి గ్రామ హరిజనులు సవర్ణులతో సమానంగా వ్యవసాయం చేయుట, పసుపు మొదలైన సరకుల వ్యాపారంలో పోటీ చేయుట ప్రారంభించారు. భూస్వాముల వద్ద పాలేర్లుగా పని చేయుట మానుకున్నారు. వ్యాపారంలో భూస్వాములు కోరిన ధరకు పసుపు విక్రయించుట నిరాకరించారు.

హరిజనులలో కలుగుతూన్న యీ చైతన్యం చూచి, నూతక్కి భూస్వాములు వారిపై అనేక దౌర్జన్యాలు ప్రారంభించారు. గత మాసం రెండవ వారంలో సుమారు పదిమంది హరిజనులను గ్రామ చావడికి పిలిపించి, 5 గురు భూస్వాములు చావడి వెనుక ఉండే ఇరుకైన సందులో వారిని పెట్టి, వ్యవసాయంలోనూ వ్యాపారంలోనూ వారు చేస్తున్న పోటీ మానవలసిందని బెదిరించారు. కర్రలతో వారి నందరినీ చావ మోదారు. శరీర మంతటా గాయములు తగిలాయి. ఒకనికి కుడి కాలి యెముక విరిగింది. గాయముల చికిత్స కొరకు వీరు మంగళగిరికి ప్రయాణం అయితే కేసు వస్తుందేమోనని తలచి, భూస్వాములు బండ్లవాళ్ళను భయపెట్టి ఎక్కడికీ వెళ్ళనీయ లేదు. కేసు చేస్తే నాశనం చేస్తాం అని బెదిరించారు. మాల, మాదిగ పల్లెల నుంచి యెవరూ యెక్కడికీ వెళ్ళకుండా చుట్టూ కాపలా పెట్టారు. ఈ దౌర్జన్యా లన్నిటికీ భయపడి, హరిజనులు ఎవరికీ రిపోర్టు చేసుకోలేక పోతున్నారు. లేబర్ స్కూలులో పని చేస్తూన్న టీచర్ సహితము మరొక గ్రామానికి పారిపోయాడు.

రివరెండ్ చిన్నప్ప అనే ఒక కాథలిక్ పాదిరీ తన సంచారంలో నూతక్కి వచ్చినప్పుడు గాయపడిన హరిజనులను స్వయంగా చూచి, గ్రామ పరిస్థితులను తెలుసుకొని, మంగళగిరి పోలీసు స్టేషన్‌లో రిపోర్టు చేశాడు. కాని, పోలీసులు విచారణ చేయలేదు. తరువాత, గుంటూరు జిల్లా ఆది ఆంధ్ర సంఘాధ్యక్షులైన నూతక్కి వెంకటేశ్వర్లు గారు, లేబర్ స్కూలు హెడ్ మాష్టరు గారైన పి. అంజయ్యగారు పై వివరములను తెలియ జేస్తూ జిల్లా కలెక్టరుకు, జిల్లా పోలీసు అధికార్లకు పిటీషన్లు పంపారు. మదరాసు మంత్రి వర్గానికి కూడా ఆ నకళ్ళు పంపారు. టెలిగ్రాంలు కూడా చేశారు. కాని, జిల్లా అధికార్లు గాని, మంత్రి వర్గం గాని నేటి వరకూ ఎట్టి చర్య తీసుకోలేదు. నూతక్కి భూస్వాములు ఆడినది ఆట గాను, పాడినది పాట గాను ఉన్నది. హరిజనులు మార్షల్ లా లో ఉన్నట్టు ఉన్నారు. వారి మొరలు వినడానికి కూడా ఎవరూ లేరా అని అనిపిస్తోంది.

## జలంత్రా.

ఉత్తర విశాఖపట్నం జిల్లాలో జలంత్రా ఎస్టేటు రైతులు, మలపా పురం, జింకి భద్రా, లఖవరు, బేసి, బురగాం, జలంత్రా గ్రామ కాంగ్రెసు కమిటీల యాజమాన్యమున జలంత్రాలో సమావేశమై యీ సంవత్సరం వర్షములు లేమిచే పంటలు పండనందున జమీందారు గారు రెమిషన్ యిప్పించ వలసినదనిన్నీ, సాధ్యమైనంత త్వరలో జలంత్రా—పాడిగాం ప్రాజెక్టును కట్టించ వలసినదనిన్నీ, పశువుల పుల్లరి రేట్లును పూర్తిగా రద్దు చేయవలసినదనిన్నీ తీర్మానించారు.

## మదరాసు.

మదరాసు ప్రభుత్వ జమీందారీ విచారణ సంఘం వారి నివేదిక నవంబరు నెలలో శాసన సభ్యులకు అందజేయ బడునని తెలుస్తోంది.

కాంగ్రెసు మంత్రి వర్గం వారు త్వరలో జమీందారీ రైతులకు తగిన రక్షణ ఇస్తారని ఆశతో కనిపెట్టుకొని చూచుచున్నారు; లేనిచో, జమీందార్ల దౌర్జన్యాలను ఎదుర్కొనుటకు ప్రజా ఉద్యమాన్ని లేవదీయుటకు ఇది వరకే పూనుకొని యుండే వారు. ఈ విషయం గ్రహించి, విచారణ కమిటీ వారు రైతులకు సదుపాయం కలిగించే సవరణలు త్వరలో సూచించి, అవి శాసన బద్ధం చేయవలసి యుంటుంది. ఈ లోగా, మునగాల మొదలైన ఎస్టేటులలో జమీందారీ నౌకర్లు, తుంటర్లు చేస్తూన్న అత్యాచారాలను అరి కట్టుటకు ప్రభుత్వం ధైర్యంగా ప్రయత్నించాలి.

## బొంబాయి.

బొంబాయి కాంగ్రెసు మంత్రి వర్గం తీసుకొని రాబోతూన్న తైతాంగపు బిల్లును నిరోధించుటకు ప్రెసిడెన్సీ భూస్వాముల సంఘం తీవ్రమైన ఉద్యమం ఒకటి లేవదీసింది. బిల్లులో రైతులకు కావలసిన సదుపాయము లన్నీ లేకపోయినప్పటికీ, అనేక లోపములు కూడా ఉన్నప్పటికీ, యీ బిల్లు విప్లవకరమైనదనీ, అది ప్యాసయితే, సమాజం యొక్క పునాదు లన్నీ తారు మారు అవుతాయనీ, భూస్వాముల సమావేశంలో పెద్ద పెద్ద తీర్మానాలు చేయబడ్డాయి. అదే రోజున కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యొక్క, గిర్నీ కాంగార్ కార్మిక సంఘం యొక్క, ప్రెస్‌వర్కర్సు యూనియన్ యొక్క యాజమాన్యమున బొంబాయి వీధులలో పెద్ద ఊరేగింపు బయలుదేరి, భూస్వాముల ఆందోళనకు వ్యతిరేకంగా ఆందోళన జరిగింది. బొంబాయి మంత్రి వర్గం వద్దకు భూస్వాము లనేకమంది రాయబారములు వెళ్తున్నారు. ప్రభుత్వంపై విపరీతమైన ఒత్తిడిని తీసుకు వస్తున్నారు.

## సరిహద్దులో రైతు నాయకుల ఎరస్టు.

సరిహద్దు రాష్ట్రంలో, తోరూ నవాబ్ తన భూములను సాగు చేసే రైతులను అక్రమంగా తొలగిస్తే, పెద్ద సత్యాగ్రహోద్యమం బయలుదేరింది. సోషలిస్టులు, రైతు సంఘ నాయకులు దానికి నాయకత్వం వహించారు. అనేకమందిని ఎరస్టు చేశారు. తరువాత నవాబ్‌తో రాయబారములకు వెళ్ళగా అవి విఫలమయ్యాయి. కాబట్టి, తిరిగి సత్యాగ్రహం ప్రారంభించబడింది. ఆజ్ఞలను ఉల్లంఘించి రైతులు భూములను సాగు చేస్తున్నారు. ఘల్లాధర్‌లో 15 గురు సోషలిస్టు, రైతు నాయకులను ఎరస్టు చేశారు. వెంటనే 10,000 మంది రైతులు పెద్ద ఊరేగింపు, బహిరంగసభ జరిపి ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని ఖండించారు. మరునాడు "సమర సంఘ" (war council) సభ్యులైన 18 గురిని పోలీసులు ఎరస్టు చేశారు. అయినప్పటికీ రైతులు నిరుత్సాహం పొందలేదు. అనేక వందల మంది ఎర్ర చొక్కాల వాలంటీర్లు, రైతులు తమ కొడవళ్ళతోను, యితర పరికరములతోను బ్రహ్మాండమైన ఊరేగింపు చేశారు. మర్దాన్‌లో జరిగిన బహిరంగ సభలో ఈ ఎరస్టులను గర్హిస్తూ ఉపన్యాసము లీయబడినాయి.

## బీహార్.

బీహార్ జమీందార్లకూ, కాంగ్రెసు మంత్రి వర్గానికీ మధ్య జరిగిన ఒడంబడికను ఖండించుటకు బీహార్ రాష్ట్ర మంతటా రైతు సంఘం యొక్క యాజమాన్యమున ఊరేగింపులు, బహిరంగ సభలు జరిగాయి.

## తూ. గో. జిల్లా రైతు కార్య సంఘ తీర్మానాలు.

1. సప్తమ ఆంధ్రరాష్ట్ర రైతు మహా సభకు తూర్పు గోదావరి జిల్లా రైతు స్థాయి సంఘ సభ్యులనందరిని డెలిగేట్సుగా ఎన్నుకోవడ మైనది.

2. నూతనముగా ఆయకట్టులో చేర్చు భూములకు నజరానా వసూలు చేయుట న్యాయము కాదు గావున నజరాను వసూలు చేయుట మానివేయ వలసినదిగా గవర్నమెంటును కోరడ మైనది.

రాజమండ్రి. 26—8—38 — పెన్మెత్స సూర్యనారాయణ, ప్రధాన కార్యదర్శి.



## వార్తాలహరి

ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘము.

ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ కార్య నిర్వాహక వర్గ సమావేశము సెప్టెంబరు 3 వ తేదీని (శనివారం) కృష్ణా జిల్లా గన్నవరం తాలూకా వీరవల్లి గ్రామంలో రాత్రి 8 గంటలకు ఆంధ్ర రాష్ట్ర రైతు మహా సభ వారి పెండాలులో జరుగును గాన ఇదే నోటీసుగా భావించి కార్య నిర్వాహక సభ్యులందరు తప్పక విచ్చేయ ప్రార్థన.

ఎజండా

1. నేషనల్ యూత్ గార్డ్సు
2. నాల్గవ రాష్ట్ర యువజన మహా సభ.
3. కార్యదర్శి ప్రవేశ పెట్టు ఇతర విషయాలు.

ఇట్లు,
అల్లూరి సత్యనారాయణ
ప్రధాన కార్యదర్శి
ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘం.
27-8-38

* * *

గుంటూరు జిల్లా రైతు సంఘము.

గుంటూరు జిల్లా రైతు సంఘ కార్య నిర్వాహక వర్గ సమావేశము 3-9-38 తేదీన మధ్యాహ్నం 2 గంటలకు రాష్ట్ర రైతు కాన్ఫరెన్సు పెండాలులో వీరవల్లిలో జరుగును.

ఎజెండా.

1. జిల్లాల్లో ఫెడరేషన్, యుద్ధములకు ప్రతికూల ప్రచారము చేయుటకు సభ జరుపుటకు గాను జిల్లా కాంగ్రెసు సంఘం, ఒక ఉపసంఘమును నియమించుతూ ఇతర సామ్రాజ్య వ్యతిరేకసంస్థల నుంచి ఒక్కొక్క ప్రతినిధిని తీసుకొనుటకు ఆ ఉపసంఘమునకు హక్కు ఇచ్చినది. గాన మన సంఘము తరపున ఒకరిని నియమించవలసి యున్నది.

2. జిల్లాలో విరివిగా రైతు సంఘములు నెలకొల్పుటకు అర్హులైన వారిని నియమించుట.

3. కార్యాలయపు మార్పు.

సభ్యులెల్లరు తప్పక విచ్చేయవలసినది.

ధూళిపాళ్ళ కోటయ్య
అధ్యక్షుడు.

* * *

కృష్ణాజిల్లా యువజన సంఘ కార్య నిర్వాహక వర్గ సమావేశము.

గన్నవరం తాలూకా వీరవల్లిలో రాష్ట్ర రైతు మహా సభావరణ యందు 4-9-38 తేదీని ఉదయం 10 గంటలకు జిల్లా యువజన సంఘ వర్కింగు కమిటీ సమావేశము జరుగును. సభ్యు లందరూ తప్పక దయచేయ ప్రార్థన.

ఇట్లు
రాజగోపాలరావు
ప్రధాన కార్యదర్శి
కృష్ణా జిల్లా యువజన సంఘం. 29-8-38

కృష్ణా జిల్లా విద్యార్థి మహా సభ.

"సెప్టెంబరు చివరి వారములో జిల్లా విద్యార్థి మహా సభ జరుపబడును. ఆహ్వానింప దలచు కొన్నవారు సెప్టెంబరు 5 వ తారీఖు లోపల కార్యదర్శి (జమీ గొల్వేపల్లి) (Po.) (వయా) (పామర్రు) గారికి తెలియజేయ వలెను. సెప్టెంబరు 10 వ తారీఖున మధ్యాహ్నం 1 ఘంటకు గుడివాడలో రైతు సంఘ కార్యాలయ మందు జిల్లా కార్య నిర్వాహక వర్గ సమావేశము జరుగును.

అని ప్రధాన కార్యదర్శిగారు తెలియ జేయు చున్నారు.

* * *

రేపల్లె తాలూకా సోషలిస్టు పార్టీ సాధారణ సభ్యుల సమావేశము.

రేపల్లె తాలూకా సోషలిస్టుపార్టీ సాధారణ సభ్యుల సమావేశము సెప్టెంబరు 3 వ తేదీ (శనివారము)న ఉదయం 11 గంటలకు చెర్కుపల్లిలో జరుగును గాన సభ్యు లందరు తప్పక రావాలి. యీ మీటింగులో చాలా అవసరమైన విషయములు చర్చింపబడును. కావున సభ్యులు అశ్రద్ధ చేయకూడదు. ప్రతి సభ్యుడును పూర్తిగా ఒక రోజు ఉండుటకు తగిన ఏర్పాటుతో రావాలి.

విషయములు.

1. జిల్లా బోర్డు ఎన్నికలు
2. కాంగ్రెసు మెంబర్లను చేర్పించుట
3. పార్టీ నిర్మాణము
4. యితర ముఖ్య విషయములు.

K. రామశాస్త్రి
29-8-38 కార్యదర్శి

* * *

నోటీసు

5-9-38 సోమవారం సాయంత్రం 2 గంటలకు పామర్రులో శ్రీమతి వేములపల్లి తులశమ్మ గారి గృహమునందు కృష్ణా జిల్లా మహిళా సంఘ కార్యనిర్వాహక వర్గము సమావేశ మగును గాన సభ్యురాండ్రందరూ తప్పక రావలెను.

కార్యక్రమము

1. స్త్రీల పాటలకు బహుమతులు నిర్ణయించుట
2. డాక్టరు సుబ్బరాయన్ సతి దేశముఖ గార్ల ఏకపత్నీవ్రత చట్టము విడాకుల చట్టములను గూర్చి చర్చించుట
3. ఇతర విషయములు
4. ప్రచారపు ఏర్పాట్లు గూర్చి కార్యదర్శి సావిత్రీ దేవి గారి తీర్మానములు

వ. సీతామహాలక్ష్మమ్మ
29-8-38 అధ్యక్షురాలు.

తూ॥ గో॥ జిల్లా
మోటారు వర్కర్సు యూనియన్.
కార్య నిర్వాహక వర్గ సమావేశం.

4-9-38 ఆదివారం కోటిపల్లి యందు తూ॥ గో॥ మోటారు వర్కర్సు యూనియన్ కార్య నిర్వాహక వర్గం సమావేశమై ఈ క్రింది ఎజండా చర్చించును గావునసభ్యులు ఎల్లరూ విచ్చేయ ప్రార్థన.

1. మాన్యం మావుళ్ళు, అంగర నారాయణ, బుల్లెయ్య అను కండక్టర్లకు పోలీసువారు 15 రోజుల్లో చదువు నేర్చుకొనమని ఇచ్చిన నోటీసు.
2. డ్రయివరు, కండక్టర్లు స్వంత డబ్బు పయిన బ్యాడ్జిలు కొనుక్కొను పద్ధతి.
3. డ్రయివరు, కండక్టర్లు కష్టాలు,
4. మోటారు వర్కర్సు కష్ట సుఖములు, వార్తలు ప్రకటించుటకు, శ్రమజీవి అను పేపరును ప్రకటించు విషయము.

చిలకమర్రి సత్యన్నారాయణాచార్య,
ప్రధాన కార్యదర్శి.

భీమవరం తాలూకా కాంగ్రెసు కమిటీ తరపున కృత్తివెంటి వెంకటేశ్వర రావు, సంకు అప్పారావు, దర్భా శ్రీరామమూర్తి, గొట్టుముక్కల సుబ్బ రాజు మొదలగువారు 21-8-38 వ తేదీని బయలుదేరి గొల్లవాని తిప్ప, దిరుసుమర్రు, యనమదుర్రు మొదలగు గ్రామములలో సభలు పెట్టి, కాంగ్రెసు ఆశయములను గూర్చియు, యుద్ధ ప్రతికూలతను గూర్చియు, ఫెడరేషనును గూర్చియు, కాంగ్రెసు మంత్రులు ప్రజలకు చేసిన, చేయుచున్నట్టి పనులను గూర్చియు, కాంగ్రెసు మంత్రులను బలపర్చు విధానమును గూర్చియు విపులముగా ఉపన్యసించిరి.

ఈ దళము తాలూకా యంతయు ప్రతి గ్రామములోను ప్రచారము చేయును. కావున తాలూకాలోని ప్రజలందరు వీరికి సహాయము చేసి ప్రతి గ్రామములోను సభలకు జనులు విరివిగా వచ్చునట్లు చేయవలసినదిగా కోరుచున్నాను.

గొట్టుముక్కల వెంకట్రామరాజు
ప్రధాన కార్యదర్శి
భీమవరం.
23-8-38

## స్త్రీలు - సోషలిజం

(7 వ పేజీ తరువాయి)

గూడ తెలిసి యుండవలెను" ఈ వాక్యాన్ని రష్యాలో కమ్యూనిస్టు పార్టీ కార్యరూపానికి తెచ్చింది. 1917 లో జరిగిన విప్లవానికి పూర్వం రష్యాలోని స్త్రీల స్థితి ఇతర యూరపు దేశాల కన్న మరీ నీచంగా ఉండేది. చదువు సంధ్యలు లేవు. ఉన్నత వర్గాలకు చెందిన స్త్రీలు వారి ఇష్టము వచ్చిన వారిని వివాహం చేసుకోవ టానికి వీల్లేదు. కార్మిక స్త్రీలకు గర్భిణీతో ఉన్నపుడు శలవులేదు ఇంకా స్త్రీలకెన్నో కష్టాలుండేవి.

కమ్యూనిష్టులు అధికారానికి వచ్చిన వెంటనే పురుషులతోబాటు సమాన హక్కులు స్త్రీలకిచ్చారు. అక్కడ స్త్రీలు అంతా చదువనూ వ్రాయనూనేర్చారు. గుమాస్తాలు. ప్రొఫెసరులు ఇంజనీర్లు. జడ్జీలు. లాయర్లు మొదలైన అన్ని ఉద్యోగాలు చేస్తున్నారు. బూర్జువా దేశాలలో ఏ కొద్దిమందో చేస్తుండవచ్చు. కాని ఇక్కడ చాలమంది చేస్తున్నారు. ఇలా అంటే రష్యాలో స్త్రీలు పెండ్లి చేసుకోరు గాబోలు. సంసారాలు చెయరు గాబోలునని అనుకోవచ్చు. వారంతా పెండ్లి చేసుకొంటారు. బిడ్డలను గంటారు. పిల్లలను పెంచటానికి ప్రభుత్వం ఉచితంగా ఏర్పరచిన క్రెచ్చీలు. కిందరు గార్డనులు ఉన్నాయి. ప్రొద్దుననే పనిలోనికి వెళ్ళేటప్పుడు స్త్రీలు తమ పిల్లలను క్రెచ్చీలలోను. కిండరు గార్డనులలోనూ అప్పజెప్పి పోతారు. పిల్లలను అక్కడ సమదాయిస్తారు. పని అయిపోయిన తరువాత వారి పిల్లలను తిరిగి ఇంటికి తెచ్చుకొంటారు. గర్భిణీ స్త్రీలకు ప్రసూతికి ముందు రెండు మాసాలు. తరువాత రెండు మాసాలు జీతంతోకూడిన శలవు ఉంటుంది. ఇంట్లో వంట ఎవరు చేస్తారని గూడ సందేహము రావచ్చు. వంట చేసుకోవటానికి అవకాశం లేకపోతే హోటళ్ళ నుండి తెచ్చుకు తింటారు. ఆ హోటళ్లు బూర్జువా దేశాలలోవలే లాభాల కోసం పెట్టినవిగావు. గనుక. పరిశుభ్రమైన పదార్థారే సప్లయి చేయబడుతవి. "వంట చెయ్యాలి. పిల్లలను సమదాయించాలి గనుక స్త్రీలు ఇంట్లోనే ఉండాలి" అని చెప్పేవారి వాదన సరియైనదిగాదని పై విషయాలు రుజువు చేస్తాయి.

జారు చక్రవర్తి పరిపాలించే టప్పుడు రష్యాలోని పట్టణాలు వ్యభిచారుల ఇండ్లతో నిండి ఉండేవి. కమ్యూనిస్టులు ప్రభుత్వానికి వచ్చిన వెంటనే వ్యభిచార వృత్తి నిషేధించారు. వ్యభిచారానికి అలవాటు పడిన వారికి చేతి వృత్తులు నేర్పి వారికి జీవించే మార్గాన్ని చూపారు. అందువల్ల ఇప్పుడు రష్యాలో వ్యభిచార వృత్తి పూర్తిగా నశించింది.

### ఇతర దేశాల విఫలత

ఈ పైన జెప్పిన హక్కులు స్త్రీలకు మరి ఏ యితర పెట్టుబడిదారీ దేశాల్లోనూ లేవు. మొట్టమొదట స్త్రీలను ఇండ్లలోనుంచి బయటికి తీసుకువచ్చింది. బూర్జువా విధానమే. యంత్రాభివృద్ధి అయ్యేకొంది. యంత్రాలమీద పని చేయటానికి స్త్రీలు. పిల్లలు గూడ పనికివచ్చారు. స్త్రీలకు పురుషులకన్నా తక్కువ కూలి ఇచ్చి ఎక్కువ లాభాలు తీయవచ్చునని ఫ్యాక్టరీలలో స్త్రీలను నియమించ ప్రారంభించారు. కార్మిక స్త్రీలకే స్వాతంత్ర్యం వచ్చింది మిగతా బూర్జువా, మధ్య తరగతి స్త్రీలు యథాప్రకారంగా భర్త ఆజ్ఞలకు లోబడి ఉండాలసినదే. బాగుగా నాగరిక దేశమనుకొనే ఇంగ్లాండులోనే మొన్న మొన్నటి వరకూ స్త్రీలు శాసన సభలకు ప్రతినిధులుగా ఉండే హక్కులేదు. స్త్రీలు పెద్ద ఆందోళనను లేవదీసిన తరువాతనే వారికా హక్కు ప్రసాదించ బడ్డది. గత 1914 లో వచ్చిన ప్రపంచ యుద్ధంలో, పురుషులంతా యుద్ధంలో పాల్గొంటున్నపుడు గుమాస్తాలుగనూ, పోలీసులుగనూ, ఫ్యాక్టరీ కూలీలుగనూ విరివిగా అన్ని యూరపు దేశాలలోను స్త్రీలు నియమించబడ్డారు. మరల యుద్ధానంతరం స్త్రీలను చాలమందిని ఉద్యోగాలలో నుండి తీసివేశారు. 1929 లో ఆరంభమయిన ప్రపంచ ఆర్థిక క్షోభ చాలమందిని నిరుద్యోగులుగా చేసివేసింది. దానితో ఒకప్పుడు "స్త్రీలను ఉద్ధరించేవార"మని చెప్పేవారు, "స్త్రీలు పవిత్రమైన వస్తువులనీ, వారు ఇంటి వెలుపలకు రాగూడదనీ, పిల్లలను కని పెంచటమే వారివిధి" అనీ ప్రచారం సాగించారు. ఈ ప్రచారం శాసన సభలను రద్దుజేసి. నిరంకుశ ప్రభుత్వాలను స్థాపించిన జర్మనీ, ఇటలీ మొదలైన ఫాసిస్టు దేశాలలో కార్యరూపాన్ని దాల్చింది. జర్మనీ దేశపు నియంత హిట్లరు ఈవిధంగా చెప్పాడు.

### నాజీ నరకం

"పురుషుల కార్యభూమి రాజకీయ రంగమే. అతడు సంఘము కొరకై జీవితము నర్పించుటకు సంసిద్ధుడై యుండవలెను. మానవ జీవితములో పురుషుని పాత్ర ప్రాధాన్యత వహించుచున్నది. స్త్రీ, సంఘములో అంతగా ప్రాముఖ్యపాత్ర వహింపజాలదు. ఎందువల్లనన ఆమెకు భర్త, పిల్లలు, కుటుంబము, గృహము ఇవియే సర్వస్వమునూ. ఇవియే ఆమె లోకము." జర్మనీలో స్త్రీలు పరిశ్రమల నుండీ ఉద్యోగముల నుండీ తొలగింపబడిరి. ఈ ఖాళీ అయిన స్థానాలలో నిరుద్యోగులైన పురుషులను నింపుచున్నారు. ఈవిధంగా చేసి నిరుద్యోగాన్ని తీసివేశామ్మని నాజీ నాయకులు ప్రగల్భాలు కొట్టుచున్నారు. స్త్రీలు ఉన్నత విద్యను బడయటానికి వీలు లేకుండా శాసనాలు చేయబడ్డాయి. విశ్వవిద్యాలయ విద్యార్థులలో 100 కి 10 మంది కన్న ఎక్కువ స్త్రీలు ఉండగూడదని శాసించారు. కారణం ఎక్కువమంది చదువుకొన్నట్లయితే ఉద్యోగాలు ఇవ్వలేమని భయం. ప్రభుత్వం స్త్రీలకు 'లేబరు కాంపులు' పెట్టి గృహకృత్యాలు నేర్పుచున్నారు. దీనివల్ల స్త్రీలు ధనవంతుల ఇండ్లలో పనికత్తెలుగా ఉండవలసి వస్తుంది. వీరిని ఎంత క్రూరంగా హింసించినా ప్రభుత్వం జోక్యం కలిగించుకోదు. అంటే చాల రోజుల క్రింద నశించిన స్త్రీల బానిసత్వాన్ని మరల పునరుద్ధరించుచున్నారన్నమాట.

### జర్మనీలో వ్యభిచారం

వ్యభిచారవృత్తి నాజీలు అధికారానికి రాకమునుపు నిషేధింప బడినది. నాజీలు అధికారానికి వచ్చిన వెంటనే ఆ నిషేధాన్ని తీసివేసి ప్రతి పట్టణములోనూ వారికి కొన్ని వీధులను ప్రత్యేకించారు. 'పచ్చ టిక్కట్లు' కొన్నవారే ఆ వృత్తిని స్వీకరించాలని శాసించారు. జర్మనీలో తదితర కాపిటలిస్టు దేశాలలో కన్నా అనేక రెట్లు వ్యభిచారవృత్తి పెరిగిపోయింది. దీనితోపాటు రోగాలు పెరిగిపోయినాయి. అన్నిటికన్నా విచిత్రమైన విషయం ఇంకొకటి. స్త్రీలను ఉద్యోగాలనుండి తీసివేయటమే కాక. జాతీయ వ్యవహారములలో నుండి గూడ తీసివేస్తున్నారు. రీచ్ ప్రెసిడెంటు హిండెన్‌బర్గు చనిపోయినప్పుడు అతని అంత్య క్రియలకు స్త్రీలను రానివ్వలేదు. ఇంకా ఇటువంటివే ఎన్నో ఉన్నవి.

### సోషలిజమే శరణ్యం

పై విషయాలన్నీ పరికించితే బూర్జువా వర్గాలవారు, వారికి అవసరంవచ్చినప్పుడు స్త్రీలను ఉద్ధరించే వారిలాగా బయలుదేరుతారు. అవసరం తీరిన తరువాత ఎప్పటిచోటుకే నెట్టుతారని తేలుతుంది. ఫేసిస్టు ప్రభుత్వాలు ఇప్పుడు జర్మనీ, ఇటలీ, ఆస్ట్రియా, పోర్చుగల్ మొదలగు దేశాల్లో స్థాపింపబడ్డాయి. ఈ జాడ్యం అన్ని దేశాలకు పాకుతోంది. ఫేసిస్టులు జయించితే జర్మనీలోవలె స్త్రీ జాతి బానిసలు గాకమానరు. ఫేసిజాన్ని రూపుమాపటానికి కంకణం కట్టుకొన్న సోవియటు రష్యా పక్షం వహించి స్త్రీలంతా పోరాడాలి.

దోపిడీ విధానాన్ని అంతంజేసి కష్టించు వారికే సమస్త సౌఖ్యాలను చేకూర్చే సోషలిస్టు సమాజమే పురుషుల నిరంకుశత్వాన్నుండి స్త్రీలను రక్షించగలదు. "కోట్ల కొలదిగా నున్న స్త్రీలను మినహాయించుచో సోషలిస్టు సమాజాన్ని సాధించలేము" అని లెనిన్ చెప్పాడు.

## కార్మిక సమస్యలు

(3 వ పేజీ తరువాయి)

26 వ తేదీ సాయంత్రం బస్సు కార్మికులందరూ సమావేశమై వీటిని చర్చించి అంగీకరించిరి. యీలోపుగా పనివారిని తొలగించుట మొదలగు చిన్నచిన్న తగాదాలను పరిష్కారం చేయుటకై ముగ్గురితో కూడిన ఒక ఉపసంఘమును ఏర్పాటు చేయవలసినదని సూచించిరి. దీనికి యజమానులు అంగీకరించిరి. పనివారి తరపున ఒకరు. యజమానుల తరపున ఒకరు, కంపెనీ యూనియన్ అధ్యక్షుడు యీ కమిటీలో నుండునట్టు యజమానులు అంగీకరించుటచే సమ్మె ఆపుచేయబడినది. 27 వ తేదీ ఉదయం బస్సులు మామూలుగా పనిచేయ సాగినవి.

జీతాలను గురించిన తగాదా పరిష్కారమయ్యే లోపుగా మోటారు పనివాండ్రు తమ బలాన్ని, కట్టును వృద్ధి చేసుకోవాలి.

### బొంబాయి

బ్రాడ్‌బరీ మిల్లులలో 19 మంది స్పిన్నింగ్ డిపార్టుమెంటు కూలీలను పనిలో నుంచి యజమానులు తొలగించుటచే 600 మంది కార్మికులు 23 వ తేదీని సమ్మె ప్రారంభించిరి. పికెటింగు కూడ మొదటిరోజునే ప్రారంభించిరి. 24 వ తేది ఊరేగింపు జరిపిరి. పోలీసులు దాన్ని నిషేధించి పేరేలు వంతెనవద్ద ఆపుచేసిరి. పోలీసులకు కూలీలకు చిన్నచిన్న దెబ్బలాటలు జరిగినవి.

25 వ తేదీని 600 మంది కూలీలు ఊరేగింపులో బయలుదేరిరి. డాంగే, మణిబెన్, మిరాజకర్ వగైరాలు నాయకత్వం వహించిరి. పోలీసులు తిరిగి అడ్డుతగిలిరి. కార్మికులు రోడ్డు మీద చదికిలబడిరి. నాయకులు ముందుకు పోయి కమీషనరుతో మాట్లాడిరి. నిషేధపు టాజ్ఞను తగ్గించుటకు కమీషనర్ అంగీకరించెను. ఇంతలో వర్షము వచ్చుటచే ఎవరివారిని వారు వెడలిపోయారు.

బొంబాయి కార్మికుల ఊరేగింపు ఏల నిషేధింప బడినది అని శాసనసభలో ప్రశ్నింపగా ప్రధాని ఖేరుగారిట్లు జవాబిచ్చిరి." ఈ సమ్మెదారులు బ్రాడ్‌బరీ మిల్లు యజమానులచేతనే నడుపబడే ఫెనిక్సు మిల్లు కూలీలను కూడ సమ్మెలో చేరవలసినదని నిర్బంధించెదరని పోలీసులకు ఆచూకీ వచ్చుటచే ఆ ఊరేగింపు కొన్ని ప్రాంతాలలో నిషేధింపబడినది"

తరువాత తిరిగి ప్రశ్నించగా, "కార్మికుల పౌరసత్వపు హక్కును నిలుపుటకు సర్వవిధములా కృషి సల్పెదనని" ఖేరుగారు జవాబిచ్చారు.

**స్త్రీ కార్మికులకు ప్రసవకాల భృతి.**

స్త్రీ కార్మికులకు ప్రసవకాల భృతి నిచ్చుటకు బొంబాయి శాసనసభలో చట్టమును పెట్టనున్నారు. బీహారులో యిట్టి శాసనాన్ని ఏర్పాటు చేయవలసినదని శ్రీమతి ఎ. లక్ష్మీభాయిగారు శాసన సభా సమావేశమునకు నోటీసిచ్చారు.

### కలకత్తా

**లాఠీఛార్జి.**

మహాలక్ష్మీ బట్టల మిల్లులలో సమ్మె చేస్తూన్న కార్మికుల స్థానంలో కొత్తవారిని పెట్టుటకై యజమానులు కొందరిని రైలుమీద తీసుకొని వచ్చుచుండగా కార్మికులది తెలుసుకొని పాల్టా రైలు స్టేషను వద్దకు పోయిరి. పోలీసులు అక్కడ కాపలా గాయుచుండిరి. పోలీసులపై కూలీలు రాళ్ళు రువ్విరి. కూలీ లింకొక స్టేషనులో దిగి మిల్లులోనికి వెళ్ళిరని తెలిసి సమ్మెదారులు మిల్లు వద్దకు పోయిరి. అక్కడ పోలీసులు లాఠీచార్జి చేసి, 25 మందిని ఎరస్టు చేశారు.

### ఢిల్లీ.

**గాంధీగారి స్టేట్‌మెంటు ఐక్యతకు హానికరం.**

ఢిల్లీ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు గాంధీగారి లోగడ స్టేటుమెంటు (పికెటింగు హింసయే అనినది) విమర్శిస్తూ "అనాలోచితం" అన్నారు. జాతీయైక్యత కిది భంగం కలిగిస్తుంది, గాన దీనిని ప్రతిఘటిస్తూ కార్మిక సంఘాలు ప్రదర్శనాలు చేయవలసినదని హెచ్చరిక నిచ్చారు.

బేరియల్లీలో టర్పెంటైన్ ఫ్యాక్టరీల్లో పని చేసే 400 మంది కార్మికులు 17 వ తేదీని సమ్మె ప్రారంభించారు. ఒక ఊరేగింపునూ బహిరంగ సభనూ జరిపారు.

---

### సవరణ

**తెనాలి బైండింగ్ పనివారలు**

తెనాలి బైండింగ్ పనివారల గురించి 10-8-38 వ తేదీన నవశక్తిలో ప్రచురించిన వార్తలలో కొన్ని పొరపాట్లు దొర్లినవి. కనుక ఈ సవరణ పాఠకులు గమనించ ప్రార్థన.

"యజమానులు జీతం బిగపట్టలేదు. రాజీ సంభాషణల జరిపిన వారలలో పట్టణ కాంగ్రెసు ప్రెసిడెంటు లేడు. పనివారలు సమ్మె చేస్తామని బెదిరించలేదు. సమ్మె చేయవలసిన పరిస్థితులు ఏర్పడునని తెలియజేశారు."

—సంపాదకుడు.

# సాహిత్యం విప్లవానికి సాయపడుతుంది!

## అట్టి విప్లవ సాహిత్యము కావాలంటే మీరు చదువవలసినవి:—

### ఆదర్శ గ్రంథ మండలి, యలమర్రు. (కృష్ణా జిల్లా)

కారల్ మార్క్సుది—కమ్యూనిష్టు ప్రణాళిక(నిషేధింపబడినది): లెనిన్ ది—సామ్రాజ్యవాదము (నిషేధింప బడినది): ఏంజిల్సుది—సామ్యవాద సిద్ధాంతాలు 0—2—0 : మాక్సింగోర్కీ-ది—అమ్మ (నిషేధంపోయింది) 1—8—0 : క్రోపాటకిన్‌ది—మనధనం (అయిపోయింది): టాలుస్టాయిది—కర్షకునికాలగతి 0—1—0 : తుమ్మల వారిది—కామ్రేడ్ డిమిట్రావ్ 0—2—0: లింగయ్యది—దేవీజోన్ (జీవితము) 0—8—0 : డివేలరా (జీవితము) 0—8—0 : వలసదేశాల సమస్య 0—1—0 : స్టాలిన్—లడ్విగ్‌తో సంభాషణ 0—1—6.

### నవ్యసాహిత్యమాల, అనంతపురం.

1. ఫాసిజం 0—8—0 2. లెనిన్ 0—8—0 3. ఆస్ట్రియా 0—1—0 4. 1937 లో మాస్కో :

అందమైన గెటప్‌తో, అందరికీ అర్థమయ్యే సులభశైలితో, అందరికీ అందుబాటులో ఉండే వెలలతో, వెలువడినాయి. పత్రికలూ, ప్రముఖులూ ఈ పుస్తకాలనుగూర్చి సదభిప్రాయాలిచ్చారు.

### విశ్వసాహిత్యమాల, ముంగండ, (via.) అంబాజీపేట, తూ. గోదావరి.

లెనిన్ ఉపదేశాలు: వెల 6 అణాలు (పామీదత్తు రచన కనువాదము). పారిస్ కమ్యూన్: వెల 6 అణాలు (లెనిన్ రచన కనువాదము)

నాడు-నేడు గ్రంథకర్త: అడయాంకో వెల 1—4—0 500 పుటలు—చక్కని బైండు—మంచి గెటప్.

### ప్రొలిటేరియన్ సీరీస్

**అన్నా** జర్మనీలో కార్మికులు, కమ్యూనిస్టులు సల్పిన పోరాటం—త్యాగం—విప్లవం—కనులకు కనబడేటట్లు చిత్రించాడు నవలాకరుడు అన్నా'లో. అశ్వనీకుమార్ దత్తగారు మంచి రసవంతంగా అనువదించి ఆంధ్రులకు అందించారు. ఇలాంటి వీరగాధను చదవండి: ధన్యులుగండి: 300 పేజీలు. అర్ధరూపాయే సుమా: మీ కాపీకి వెంటనే ఆర్డరు యివ్వండి. ఏజన్సీ కావలసినవారు అణా బిళ్లలో వ్రాయండి, పుస్తకము కావలసినవారు పది అణాల ఆపైసలు తపాలా బిళ్లలు పంపించండి.

దర్భా శ్రీరామమూర్తి, న్యూస్ ఏజంటు, భీమవరం; పశ్చిమ గోదావరి.

### నవశక్తి కార్యాలయం, బెజవాడ.

మాస్కో తిరుగుబాటు. వెల ఒక అణా. భారత కార్మికోద్యమ చరిత్ర. వెల 0—4—0 గ్రంథకర్త: తుమ్మల వెంకట్రామయ్య.

నిర్మాణ సమస్యలు. వెల 0—1—0. గ్రంధకర్త:-పుచ్చలపల్లి సుందరయ్య

### అతివాద గ్రంథమండలి, గుంటూరు.

1922 మన్యంలో రైతుల తిరుగుబాటు (అల్లూరి సీతారామరాజు) చందాదారులకు 0-12-0 ఇతరులకు 1-0-0. విలువ, ఖరీదు, లాభము. 0-5-0 ఇతరులకు 0-8-0.

స్టాలిన్ ఉపన్యాసము—నూతన రాజ్యాంగవిధానం. 0-5-0 ఇతరులకు 0-8-0.

### హిందీ పత్రికలు.

**జనతా** సోషలిస్టు వార పత్రిక. బీహారు రాష్ట్రంలో స్వామి సహజానందుని నాయకత్వం క్రింద జరిగే రైతు ఉద్యమాన్ని గూర్చి తెలుసుకోవాలంటే దీనిని చదువాలి.

సం॥ చందా రు 3-0-0. మేనేజరు, జనతా బంకిపూరు, పాట్నా.

**నయా హిందూస్తాన్** సోషలిస్టు పక్ష పత్రిక. సంపాదకుడు : సయ్యద్ జహీర్. 'నయా హిందూస్థాన్,' కార్మిక కర్షక పోరాటాలను వృద్ధి చేస్తుంది. తీవ్ర వాదుల, సోషలిస్టుల అందరియొక్క ఐక్యతకు నాయకమణి. అక్టోబరు ౧వ తేదీనుండి వెలువడుతుంది. విఖ్యాత సోషలిస్టుల, రచయితల వ్యాసాలు ఉంటాయి.

ఇపుడే చందాదారులు కండి: సంవత్సరం చందా రు. 2-0-0. మేనేజరు నయాహిందుస్థాన్ 90. జీరో రోడ్డు, అల్లాహాబాదు.

**ప్రభ** మార్క్సిస్టు మాస పత్రిక. భారతదేశమందలి సుప్రసిద్ధ కమ్యూనిస్టులు సోషలిస్టులు వ్యాసాలు వ్రాస్తున్నారు. హిందీ వచ్చిన ప్రతి వ్యక్తీ చదువాలసిన పత్రిక.

సం॥ చందా 1—8—0. విడి ప్రతి 0—2—0. మేనేజరు "ప్రభ" బైరహనా, అలహాబాదు.



Printed, Edited and Published by M. Annapurniah at Navasakti Press, Governorpet, Bezwada.

